# ఏకాదశి

[పదకొండు కథలు]

శ్రీ చింతా దీక్షితులు

బి. ఏ., ఎల్. టి.



సాహితీసమితి. తెనాలి

*

సాహితీసమితిసభాపతి అనే అభిమానమూ

కవి, వ్యుత్పన్నుడూ అనే గౌరవమూ

గ్రంథరచనకు మార్గదర్శి అనే కృతజ్ఞతా

సుహృద్రత్న మనే అనురాగమూ

సార్థకం చేసుకోవడానికి

శ్రీ శివశంకరశాస్త్రి అన్నగారికి

ఈకృతిని అంకితం చేస్తున్నాను

*

# ఆముఖము

ఏకాదశి అంటే తిథితో సంబంధం లేదు: పదకొండుకథల సంపుటి అన్నమాట. శ్రీ విద్యారణ్యస్వామివారు పదిహేనుప్రకరణాల వేదాంత గ్రంథాన్ని పంచదశి అన్నారు.

కథ్ ధాతువుకు చెప్పడం అని అర్థం. దానిమీది నుంచి వచ్చిన కథాదిశబ్దాలు చెప్పడాన్ని బోధిస్తవి. కాబట్టి కథలు చెప్పుతూ వున్నట్టు తోచవలి. వాడుక భాషలో వుంటేనే తప్ప కథ చెప్పుతూ వున్నట్టు స్ఫురించదు. ఈ కథకుడు గోదావరి జిల్లావాడు కావడంచేత మధురమైనపదాలూ, వివిధమండలాల్లో విస్తారంగా సంచారం చేసినవాడు కావడంచేత రకరకాల మంచి పదాలూ తనకథలలో వాడినాడు. ఈ కథాదికములో భాష సలక్షణమై సాంప్రదాయసిద్ధమైన తేట తెనుగు. ఇందులో జాతీయజీవనం ప్రతిబింబిస్తున్నది. కొమ్ములు తిరిగిన ఆంధ్రపండితులు పూర్వకాలాలనుంచీ వచనరచనలో ఇలాంటిభాషే వాడేవారు. బడిపుస్తకాలలోభాష ఇలాంటిదే వుండేది. కొన్నిసంవత్సరాలనుంచీ కొంతమందికి నిష్కారణంగా తేట

తెనుగు మీద ద్వేషభావం కలిగింది. శ్రీ రావు సాహెబ్ గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యాసాలూ, ముఖ్యంగా వారి ఆంధ్రగద్య చింతామణి సావధానంగా పఠిస్తే అపోహలు తొలగిపోతవి.

❀ ఈకథలలో నానాత్వమూ, చమత్కారిత్వమూ కనబడుతున్నవి. మన కథ, కథానకము, ఆఖ్యానకము, ఆఖ్యాయిక అనే విభాగాలనూ, ఇంగ్లీషులో Story, Tale, Sketch అనే విభాగాలనూ ఇంచుమించుగా సరిపోయేలాగున వుంటవి దీక్షితులుగారి కథలు. కథా లక్షణాలు వుండడంచేత ఈ సంపుటిలో చేరింది సరుకంతా.

❀ ఈగ్రంథకర్త కథకచక్రవర్తి. ఈయన కథలు ప్రచారంలోకి రాకపూర్వం అచ్చుపడుతూ వుండేవాటికీ, తర్వాతవాటికీ చాలా తారతమ్యం గోచరిస్తుంది. అదివరలో కథా వాఙ్మయంమీద ఒకమోస్తరుగా వున్నవెలి క్రమంగా తొలిగిపోయింది. ఇప్పుడు సామాన్యులూ, ఉత్తములూ, కథారచనలోకి వచ్చారు. ప్రతిపత్రికా కథలు ప్రచురించడం అత్యవసరంగా భావిస్తున్నది. కథకు సాహిత్యశ్రేణిలో గొప్పతావు లభిస్తున్నది. ముందు ముందు మనవాఙ్మయంలో కథ ఇంతకంటె ప్రబలమైన గౌరవం పొందుతుంది.

ఈకథకునిగురించిన పై విషయాలు సరసులు అంగీకరించినవే కావడంచేత పాఠకులకు ప్రసన్న దృష్టి కలిగించడం కోసమై ఇక్కడ దిఙ్మాత్రంగా ఉద్ఘాటన చేశాను. ఈ గ్రంథం నాపేర అంకితం కావడంచేత నా అభిప్రాయాలు వెలిబుచ్చలేదు.

శ్రీ శివశంకర శాస్త్రి

సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము
ఫిబ్రవరి, [illegible]

# శ్యామల

గుంటూరులో మొన్న మొన్నటిదాకా సబ్ జడ్జీ చేసి జనేవరినెలలో కాలంచేసిన శ్రీధరరావుగారి స్వకీయ చరిత్ర యీ సంచిక ముద్రిస్తున్నాము. ఆయన చనిపోయి న కొన్ని నెలలదాకా ఆయన కాపుర మున్న యిల్లు తాళము వేసియుండెను. తరవాత ఆయన అల్లుడును మా స్నేహితుడును అయినముకుందరావు తాళములు తీయించి యింట్లో ప్రవేశించెను. శ్రీధరరావుగారి కాగితములు పరిశీలించడములో ఈ క్రింది స్వకీయ చరిత్ర ఆయన సొరుగుపెట్టెలో దొరికినట్లూ, అది 'సాహితి' లో ప్రకటించ వలసినదనీ మాకు చెప్పడంచేత దాన్ని మేము ప్రకటిస్తున్నాము. ఆంధ్రదేశంలో వున్న పెద్దవుద్యోగస్థులలో మంచి వాడనిన్నీ దాన శీలుడనిన్నీ, ఉపకారబుద్ధి కలవాడనిన్నీ పేరుప్రతిష్ఠలు సంపాదించిన శ్రీధరరావు గారిని ఎరుగని ఆంధ్రు లుండరు. కాని, మొదటినుంచీ పెళ్ళి చేసుకొనక బ్రహ్మచారిగానే వుండి నిష్కళంకప్రవర్తనము గలవాడై వుండుటకు కారణము ఎవరికీ ఇదివరలో తెలిసివుండదు. ఇదివరలో చాలామంది ఆయన బ్రహ్మచారి కాడనిన్నీ ప్రథమభార్య పోయిన తరువాత

౧

నేను కాలేజీక్లాసుల్లో చదువుకొంటున్న కాలంలో వున్న వుత్సాహం ఇప్పుడు రమ్మంటే ఎలా వస్తుంది? అప్పటి చురుకుదనము, అప్పటి తెలివి తేటలు లేవని నా స్నేహితులు అన్న ఎత్తిపొడుపుల్ని వింటాను. అప్పటిసరదాయే లేదని మరికొందరు పురికొల్పుతూ వుంటారు. స్నేహితులు పురికొల్పినంత మాత్రాన పోయినవి మళ్ళీ వస్తవా? పోవటకు కారణం నా స్నేహితులకు తెలియదు. నాకు తప్ప ఇంకెవ్వరికీ తెలియదు.

నా తల్లిదండ్రులు ఇంతా అంతా కాదు నన్ను బలవంతపెట్టడం పెళ్ళిచేసుకోమని. నేను చేసుకోనని భీష్మించుకు కూర్చున్నాను. పెళ్ళి చేసుకోకపోతే వంశం అంతరిస్తుందనీ, పుట్టగతు లుండవనీ ఎన్నోవిధాలుగా నయాన్నీ భయాన్నీ చెప్పి బోధించారు. పదిమంది చేతా చెప్పించారు. ఎంతచెప్పినా ఎంతచెప్పించినా నేను విన్నాను కాను. మొక్కగా వున్నప్పుడే వంచకుండా వూరుకొని చెట్టైనతర్వాత వంచడానికి ప్రయత్నించడంవల్ల ఇంతమట్టుకు వచ్చిం దనుకొని వూరుకున్నారు. ఊరుకున్నారూ—రోజుకు ఎన్ని రాయ

భారాలు స్నేహితులచేత—ఎన్ని సాధింపులు—కుక్క మీాదా పిల్లిమీాదా పెట్టి ఎన్ని తిట్లు—నా ప్రాణం కొరుక్కుతిన్నారు! ఎన్నో కొన్ని సంవత్సరాల వయస్సు చెల్లినమీాదట పుత్రుణ్ణి మిత్రుడిలాగ చూచుకోవాలన్న సంగతి వాళ్ళకు తెలియక గాదూ నన్ను ఇలా వేధించడం!

ఇంతకూ వీళ్ళవల్ల నాకు కలిగే కష్టములు ఎంత పాటి? నే నిదివరలో అనుభవించిన మనః క్లేశములో ఇది ఎన్నోపాలు? పగ లనక రాత్రి అనక—ఆశ పెట్టుకొని, ఆశ నిరాశ కాగా పొందిన చిత్తసంక్షోభమునకూ, దీనికీ సాటి వున్నదా? ధనము పోతే అంత బెంగ వుండ దనుకుంటాను, బంధువులు పోతే అంత బెంగ వుండ దనుకుంటాను. ఇంక ఏమి పోయినా మనిషికి గలిగే దుఃఖలేశము అనునయమువల్ల అంతరిస్తుంది. కాని నాకు కలిగిన దుఃఖము ఆమరణాంతము నన్నంటి వుండవలసిందే, నాతోకూడ నీడై వుండవలసిందే! ఈదుఃఖమే నాప్రాణమిత్రము. ఈదుఃఖము నన్ను ప్రేమించి నన్నంటి తిరుగుతూ వుంది. నేను దీనిని తిరిగి ప్రేమించకుండా వుండలేను.

నాకు పుట్టిన ఈదుఃఖమును నేను ప్రేమిస్తానంటే లోక మెందుకు నవ్వడం? లోకంలో ఎవరికి పుట్టిన

పిల్లలను వారు ప్రేమించకుండా వున్నారా? ఎందుకని తమ బిడ్డలను తాము ప్రేమిస్తున్నారు? తెలివి గలవారనా? పశుతుల్యులే! అందము గలవారనా? అందము లోకములో సామాన్యలక్షణము కాదే! ఆనందము కల్పిస్తున్నారనా? ఎలా ఆనందము కల్పిస్తున్నారు? తమకు పుట్టిరి కాబట్టే ఆనందము కల్పిస్తారు. ఇతరులకు పుట్టినబిడ్డలు ఆనందము కల్పిస్తున్నారా? అలాగే నాకు పుట్టిన యీ నా చిత్తక్లేశమును నేను ప్రేమిస్తాను. బిడ్డలతోటి సంసారము ఆనందదాయకమైతే ఇదీ ఆనందదాయకమే.

దీనిని మరణకాలాన నాతో కొనిపోతాను. నేను కాలముచేసిన పిమ్మట నాభౌతికదేహము అగ్నిజ్వాలల కాహుతి అవుతుంటే ఈదుఃఖము నాచిత్తిపై కెక్కి సహగమనము చేస్తుంది. ఇటువంటిదుఃఖమును నేను వదలగలనా? నేను వదలలేను! ఈదుఃఖమే నాకు సుఖము ఇస్తూవుంటే నేను దీన్ని ఎలా విడవగలను? సుఖదుఃఖములు కవలపిల్లలు. లోకములో అందరూ సుఖమనేపిల్లనే ప్రేమిస్తారు, నేను దుఃఖమును ప్రేమిస్తాను; అదే నాసుఖము, కాదా! నేను పరితపిస్తూవున్నట్లు పరితపించే ఎవ్వడైనా ఈదుఃఖమనే ప్రాణమిత్రుణ్ణి వదలి వుండగలడా? ఉదయకాలమున, చల్లని వాయు

వులు విసురుతూ లోకానందమును కల్పిస్తూవున్న సమయాన నేను నాదుఃఖమును ఆహ్వానము చేస్తాను. సాయంకాలమున సైకతములు విహరిస్తూ నాదుఃఖముతో సరససల్లాపము లాడుతాను. రాత్రి వేళలకటికినేలల పరుండి నిద్రను దూరముగా పారద్రోలి దుఃఖముతో కూడిఆడుతాను. ఈదుఃఖ మనగా ఎవ్వరు? ఈదుఃఖము నా కెందువల్ల కలిగింది? ఏవధూటిచల్లనిచూపులు నాపై పడగా, నేను ఒకప్పుడు పరవశుడనై వుంటినో అట్టి వధూటి నాకు పారితోషికంగా ఒసగిన దుఃఖము కాదా యిది? ఏలతాంగికరస్పర్శ నాకు పులకలెత్తించిందో ఆలతాంగి నాకు పరిచర్య చేయ పంపిన చెలికత్తె గాదా యిది? ఏమనోహారిణివిగ్రహము నాహృదయపీఠముపై నెలకొనివున్నదో ఆనామనోహారిణి నాహృదయముపైన వుంచినశాశ్వతముద్ర గాదా యిది? ఏసుందరాంగి వదనగహ్వరమున తాండవమాడే ప్రాణవాయువు నాకు ప్రాణము ఒసగిందో ఆసుందరాంగి నాకు పోసినజీవము గాదా యీదుఃఖము? ఏసుకుమారగాత్రి నాహృదయకోశమున ప్రణయవజ్రములు తొలుదొల్త దాచివున్నదో ఆవజ్రముల కర్కశత్వము కాదా యీనాదుఃఖము?

ఇట్టిదుఃఖము నాదగ్గరకు వచ్చి నన్ను మోహించి
వప్పుడు వద్దు పొమ్మనగలనా ? ఈదుఃఖమును నాహృదయపీఠముపైన అధిష్ఠింపజేశాను. బాష్పధారలతో దీనికి అర్ఘ్యపాద్యాలు ఒసగుతుంటిని. ఆర్తచింతలను ధారపోసి పోషిస్తుంటిని, కొలుస్తుంటిని. ఆహా! ఏమి నాసుఖము! ఏమి నాఆనందము! లోకమా, ఒక్కమారు నీకడ వున్న దుఃఖము నంతనూ నాకు వదలి వెయ్యి. ఆదుఃఖసాగరాన బడి నే నీదులాడుతాను, పరవశత్వము జెందుతాను, అపూర్వసౌఖ్యం అనుభవిస్తాను!

ఈనాదుఃఖము నన్ను భక్షించి బతుకుతున్నది. నేను లేకుంటే దీని కాహారము లేదు. దుఃఖమును తిని బతుకుతున్నాను నేను. ఈదుఃఖము లేకుంటే నేను బతకలేను. దుఃఖము నన్ను తింటున్నది, నేను దుఃఖమును తింటున్నాను. ఇందులో వింత లేదు. వృక్షములు జంతువుల కాహార మిస్తున్నవి- జంతువులు వృక్షములను పోషిస్తున్నవి; వృక్షములు జంతువులను తింటున్నవి, జంతువులు వృక్షములను తింటున్నవి. సృష్టికి మొదలు వుంటే అప్పటినుంచీ ఈసాంప్రదాయం ఇలాగే జరుగుతూవుంది.

## ౨

నేను కాలేజీలో చదవడానికి చెన్న పట్టణము వెళ్ళితిని. ఏముహూర్తాన వెళ్ళితినో ఆముహూర్తము మంచి దననా, చెడ్డ దననా? చెడ్డ దనడం ఎందుకు? మంచిదే అంటాను.

వెళ్ళినతర్వాతనే కదా నాలో సుషుప్తి గాంచి వున్నచిత్తవృత్తు లన్నీ ఒక్కమాటు ఉలిక్కిపడి లేచినవి! నాహృదయములో మొగ్గదొడుగుతూవున్న అనురాగవల్లిక ఒక్కమారుగా పుష్పించింది. నాజీవితమంతా ఒక్కసారి ఆశాచంద్రికలో ఓలలాడింది. నేను వెళ్ళడంవల్లనే కదా నాజీవితానికి పట్టుగొమ్మ ఒకటి లభించింది, లక్ష్య మొకటి చిక్కింది!

రెండవసంవత్సరం చదువు ముగియడానికి సిద్ధంగా వుంది. ఇక పదిపదిహేను రోజుల్లో కాలేజీకి సెలవులిస్తారు. అంతవరకూ నేను చాలా శ్రద్ధగా చదువుతూవున్నాను. పుస్తకాలు విడిచి నేను ఎప్పుడూ దూరముగా వుండలేదు. అప్పుడు పుస్తకము చూస్తే ఆప్తబంధువును చూసినట్లు వుండేది. పుస్తకము లప్పుడు నాకు జీవము లేని పదార్థములుగా తోచలేదు.

సజీవములై, సన్నిహితబంధువులై నన్ను కనిపెట్టుకు వున్న ప్రతిభాశాలురవలె వుండేవి. ఇట్టిపుస్తకాలమీద ఆనాటినుంచీ నాకు విముఖత్వం కలిగింది. ఈఆప్త బంధువులను ఆనాటినుంచీ దూరముగా పారదోలినాను. ఈప్రతిభాశాలుల హితవాక్యాలానాటినుంచీ వినకుండా చెడచెవిని పెట్టినాను. ఏనాటినుంచీ?

నేను చదువుతూ వున్నక్లాసులోనే చదువుతూ వున్నది శ్యామల. నాపుస్తకాలను నేను ప్రేమించి వున్నకాలములో శ్యామలపేరు నే నెరగను. నాపుస్తకాలిచ్చే ఆనందములో పరవశుడనై వున్నదినములలో శ్యామలను కన్నెత్తి చూడలేదు.

ఒకనాడు నానోటుబుక్కు బల్లమీద విడిచి వెళ్ళితిని. మళ్ళీ తిరిగివచ్చి చూచుకొంటిని. నాకళ్ళ యెదుట రెండుపేర్లు కనుపించినవి. నాపేరు పైన వున్నది. కింద శ్యామలపేరు వున్నది. ఈరెండుపేర్లు శ్యామలే వ్రాసిందని గ్రహించడంలో నాకు కష్టం లేకపోయింది. ఎవ్వరూ చూడకుండా రాసివుండాలి అనుకున్నాను.

ఆక్షణాన నేను పూర్తిగా మారిపోయినాను. ఆక్షణాన నాచిత్తములో నూతన సంస్కరణము జరిగింది. నూతనజీవితయాత్ర చేయడానికి మొదలుపెట్టినది నే నాక్షణములోనే! అప్పుడు నాకు కలిగినవుత్సాహము,

నూతనభావోదయము, పరమానందమూ అనిర్వచనీయములు.

రెండుపేర్లను నేను చదువుకొని శ్యామల కూర్చున్న బల్లవేపు చూశాను. ఆమె తలవంచి చిరునగవుతో ఏమో వ్రాసుకొంటున్నది.

ఆమెను పరిశీలించి చూడడాని కదే మొదటి పర్యాయము. ఆమె అప్పుడు నాకన్నులకు మర్త్యభామినివలె తోచలేదు, ప్రణయ జ్యోత్స్న వలె తోచింది! తూర్పుదిక్కున వుదయించే చంద్రబింబం లాగ మెరుస్తూ వున్నది కుంకుమ బొట్టు ఆమె ముఖాన.

మధ్యాహ్న కాలాన నడిమింట మార్తాండబింబం లాగ ప్రజ్వలిస్తున్నది అనురాగం ఆవిడ హృదయాన. సాయంకాలాన పక్షులు ఎలుగెత్తి పాడే ప్రణయగీతములు ప్రతిధ్వనిస్తున్నవి ఆమె హృదయంలో. తేట వెన్నెల నిగ్గులలో దోబూచు లాడే జీవకాంతులు ప్రకాశిస్తున్నవి ఆవిడ కళ్ళల్లో.

ఆనాటినుంచీ నేను పుస్తకములు ముట్టలేదు, చదువుమాట తలపెట్ట లేదు. ఆనాటినుంచీ నేను శ్యామల పేరు జపించడం మొదలు పెట్టినాను. ఆనాటినుంచీ

నాకు శ్యామల ప్రత్యక్షదైవత మైనది. నిద్రను జయించాను, ఆకలిని జయించాను. ఆమెప్రాపు గైకొనడానికై ఎంతటిత్యాగమైనా చేయగలను. మూర్తీభవించిన సౌందర్యరాశిమైనా మెట్టినూడిక మైనా పెట్టగలను. విలువ తెరగని ప్రణయసౌధమున నివసించడానికి లోకముతో సంబంధం వుండకూడదు. అట్టి సంబంధా లన్ని వదలుకున్నాను.

శ్యామల మహారాష్ట్ర బ్రాహ్మణయువతి, అవివాహిత. సంఘసంస్కర్తలయింట పుట్టింది. యౌవనలావణ్యము పుంజీభావము చెందివున్నది ఆమెయందు. నే నాంధ్రుడను, ఆమెపై నామనస్సు లగ్నము కానేల? కాకూడదా? బహుత్వము మానవులందు గాన వచ్చినా ఏకత్వభావము వారి హృదయమునకు బట్టలేదా? ఇంక జాతివిచక్షణ యెందుకు?

సంతోష మనగా ఎట్టిది? దుఃఖాభావమా సంతోషము? కాదు. ప్రణయాగ్నిజ్వాలలలో బడి తప్తమవుతున్న నాకు సంతోషము గాక దుఃఖ మెట్లు? సహింప శక్యము కాని ప్రణయ ఝంఝూనిలంలో బడి ఊపిరి తిప్పుకోలేకుండా వున్న నాకు సంతోషము కాదా?

గంభీర మై, తరింపనలవి గాని ప్రణయసాగరాన బడికొట్టుకొంటున్న నాకు సంతోషమే కదా! బ్రహ్మ సృజించినవస్తువులందు ప్రేమ లేకుంటే సృష్టి కెంత లోపము వచ్చి వుండేదో!

ఆమె విగ్రహం ఆనాటినుంచీ నాకు కళ్ళకు కట్టినట్లు వుంటూ వుండేది. ఆరోజు మొదలుకొని నేను కాలేజీకి పదిగంటలకు ముందే వెళ్ళి కూర్చుని ఆమె రాకకు ఎదురు చూస్తూ వుండేవాడను. ఆమె అడుగులచప్పుడుకు నా గుండె తాళము వేస్తున్నట్లు కొట్టుకొనేది. ఆమెవిగ్రహమును చూడడమే నాకు తృప్తిగా వుండేది. ఆమెతో మాటలాడడం సహితం లేదు. ఆమె విగ్రహమునుంచి వెడలి వచ్చేలావణ్యకాంతులను కన్నులతో తృప్తితీర తాగేవాడను. ఆమెవిగ్రహం ఎదురుగా వున్నసమయంలో నేను చెప్ప లేనిఆనందము చెందేవాడను. ఆమె విగ్రహాన్ని వీక్షించడానికి ఎప్పుడూ నేను ఉవ్విళ్ళూరుతూ వుండేవాడను.

ఆమెరాక నాకు ప్రమోదకారణము, ఆమెపోకడ విషాదకారణము.

ఆమె సాయంత్రం కాలేజీనుంచి వెళ్ళిపోయేటప్పుడు చూపు మేరదూరం ఆమెను చూస్తూ వుండడమే

నాపని. ఆమె దృష్టిపథం దాటి వెళ్ళినతోనే నాగుం డెలో రాయి పడేది. మరునాడు పదిగంటల వరకూ కాలము వెళ్ళబుచ్చడం ఎలాగు?

నాజీవితం అప్పుడు శుష్కంగా వుండేది. కాని మరునాడు వస్తుంది గదా, వస్తే మళ్ళీ జీవితానికి ఆనందం వుంటుందిగదా అనేఆశ వూతగా వుండేది.

ఊనుపోక ఒక్కొక్కప్పుడు నేను సాయంకాలము మైలాపూరు వెళ్ళేవాడను. మైలాపూరులో ఆమె కాపుర ముంట. ఆమెయింటివద్ద నేను గడిపినకాల మింతింతకాదు. ఎందుకు గడిపేను? ఆమెవిగ్రహము నా కగుపించుననా? కాదు. ఆమెతో ప్రసంగించవలెననా? కాదు. ఆమెమాటలు వినవచ్చుననా? కాదు. ఎందుకు అక్కడకి వెళ్ళితినో నాకు తెలియదు. నాహృదయము నన్ను అక్కడకు పట్టి ఈడ్చుకొని పోయేది. అంతే నే నెరుగుదును. ఒక్కొక్కప్పుడు ఆమె విగ్రహము నాకు కనువిందు చేసేది. ఆమె అవ్యక్త మధుర కంఠధ్వనులు నావీనులకు విందు చేసేవి. ఆమెమీదుగా వినరేగాలి నన్ను రాచుకుపోయేది. ఆమె ఆఘ్రాణించిన పువ్వులవాసన ఒక్కొక్కప్పుడు నానాసాపుటముల దరి జేరేది. ఆమెపైన బడిన దీపపుకాంతులు ఒక్కొక్కప్పుడు కిటికీనుంచి వచ్చి నాపై బడేవి! అది

చాలదా? ఆఆనందమును సాటివచ్చు ఆనందము కలదా? సెలవు లిచ్చేవరకూ ఇట్లు నేను కాలం గడపి నాను. సెలవులు రెండు నెలలూ నేను కాలం గడవడం ఎలాగు! సూర్యకిరణము సోకుతూ వున్నప్పుడే మొక్క ఏపుగా పెరిగి పువ్వులు తొడుగుతుంది; చీకటిలో పెరగగలదా? సముద్రంలో వుండే జలచరములు సహితము సూర్యకాంతికోసం పగటి వేళ పైకి వస్తవి; ఎప్పుడూ అడుగున కూచోవు.

ఈ రెణ్ణెల్లూ గాంధాంధకారములో నేను మసలగలుగుదునా? నెలకు కొన్నిరోజులపాటు వెన్నెల వుంది కాబట్టే లోకం కలవరం చెందడం లేదు. ఒక్కమారైనా వెన్నెల చూడకుండా రెండు నెలలు నేను బతకగలనా! సముద్రములో పడవకు తెరచాపలు చిరిగిపోతే దానిగతి ఏం కావలసింది? స్టీమరులో ఇంజన్ పాడైపోతే నడిసముద్రంలో అది ఏమి కావలసింది?

తుట్టతుదకు మనస్సు గట్టిపరచుకొని నేను శ్యామలకు ఒక చీటీ వ్రాసి పంపినాను. ఇదివరలో ఆమెతో ఒక్కమాటైనా మాటాడ లేదు. ఒక్కమారైనా ఆమెకు వుత్తరం రాయలేదు. ఈమారే వ్రాశాను. ఈరీతిగా రాశాను.

"శ్రీమతీ: తలవని తలంపుగా మీరు నాపై చూపిన ఆదరముకు కృతజ్ఞుడను. ఈఆదరము స్నేహంగా పరిణమించడానికి నే నాశపడుతున్నాను. మీయోగక్షేమములు నాకు సెలవులలో తెలియచేయవలెనని కోరుతున్నాను. అందు కనుగుణముగా మీరు మీచిరునామా నాకు పంపవలయును. ఇట్లు నేను స్వతంత్రించి వ్రాయుట మీకు అసమ్మతము కానని సూచించుటకు నాకు జవాబు వ్రాయవేడుతాను.

మీవిశ్వాసపాత్రుడు శ్రీధరరావు."

ఈచీటిని పోష్టుద్వారా పంపి జవాబుకై వేచియుంటిని. మరునాడు నాకు ఈక్రిందిరీతి జవాబు వచ్చింది.

"శ్రీయుత శ్రీధరరావుగారికి: తాము పంపిన ఉత్తరము నాకు అసమ్మత మవుతుందా? మీక్షేమము తెలిసికొనడం అనేభాగ్యమును మించిన భాగ్యము నాకు వేరుగా లేదు. నేను చూపితి నన్న ఆదరముకు మీరింతకాలము మిన్నకుండడంవలన నేను కించపడుచుంటిని, కాని మీవుత్తరము చూచిన పిమ్మట నే నాశకులోనైతిని. మీక్షేమమే నాక్షేమముగా చూచుకొనడముకు ఇష్టపడుచుంటిని. నాచిరునామా ఇందులో పంపినాను.

మీవిశ్వాసపాత్రురాలు, శ్యామల."

ఈవు త్తరమును నే నెన్నిమార్లు చదివితినో దేవునికే తెలుసును. నే నింతకాలం ఊరకుండుటకు కారణమును నేనే గ్రహింపలేకపోతిని. ఇక నాజీవనము ధన్య మైన దను కొంటిని.

3

మాయిద్దరకును రెండు నెలలపాటు ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవని వేరే చెప్పవలెనా? నేను అందరాని పళ్ళకోసం అర్రు చాపలే దని వేరే చెప్పవలెనా? నామ నోభీష్టము సిద్ధిస్తుందని వేరే చెప్పవలెనా? ముత్యముల కోవను బోలిన ఆమె అక్షరమాలికలు వుత్తరంలో చదివి చదివి నేను ఉన్మత్తుడ నయినాను. ప్రమదోన్మత్తత! సౌహార్దమును వెలిబిల్చే ఆమె జాబులు చదవడము నిత్యోత్సవముగా నేను పరిగణించడంలో వింత ఏమున్నది? ఆమె నాకు వ్రాసినజాబులకు లెక్కలేదు! నేను వ్రాసినజాబుల కంతకన్న లెక్కలేదు. మార్తాండు డపరదిక్కున గ్రుంకేవేళ శీతలవాయు మనుభవిస్తూ ఏచెట్టుమొదటనో కూర్చుండి ఆమెవుత్తరాలు ఎన్ని మారులైనా పఠించినాను. నిశాసమయాల ఆమెసుందరవిగ్రహాన్ని మానసవీథులందు సంచరింపజేస్తిని.

నాహృదయసీమలో ఆలేఖల నన్నిటిని పదిలపరచినాను. ఇట్లు గడచినవి ఆ రెండు నెలలూ. ఒక్క త్రుటిలో గడచిన వనుకొంటిని. సౌఖ్యోన్నతి యెట్టిదో అప్పుడే నే నను భవించాను. పెరుగుట విరుగుట కొరకే అని ఒకా నొకకవి అన్నాడు. పెరిగితిని పెరిగితిని, చిట్టచివరకు ఇంత విరుగుతానని ఎప్పుడూ కలనైనా తలచలేదు. హఠాత్తుగా పిడుగు నాపైన పడగ ముందు నామనో హారిణి ఒక్క లేఖ పంపింది. ఆలేఖే ఆమె నాకు రాసిన చివరలేఖ. ఆ లేఖలోనే ఆమె నా కియ్యగలిగిన సౌఖ్య మంతా ఇచ్చింది. ఇం కామెనుండి నేను లేఖను అందే భాగ్యము కోల్పోతిని! మందభాగ్యుడ నయితిని!

"రాయదుర్గము,

౧౨.౯.౧౮౯౨

"మనోహరా: శుష్కించిన ఈనాజీవితవృక్షానికి మీరు పాదు త్రవ్వి నీరు పోస్తున్నారు. ఈవృక్షం ఏపుగా పెరిగి మీకు ఫలములు ఒసగ గల దని ఆశిస్తున్నాను. నాసుఖమే మీసుఖ మనీ నాదుఃఖమే మీదుఃఖ మనీ వ్రాస్తిరి. నాసుఖము మీసుఖము కావచ్చును. నాదుఃఖము మీదుఃఖము కా నిత్తునా? మీపాదసేవ చేస్తూ మీఅండను చరించవలె నని ఉవ్విళ్ళూరే నా కెన్నడైనా దుఃఖం ఉండగలదా? సూర్య

నికి ఎదురుగా వుండే గ్రహములను ఎన్నడైనా చీకటి కప్పగలదా?

"ఏనాడు మీపైన నేను వీక్షణమాలికలను బరపితినో ఆనాడే గదా నాజన్మము ధన్యమైనది!

"ఏమో తెలియదు, ఎందుకో తెలియదు! మిమ్మలిని జూచినక్షణమందే నామనస్సు మీపైన లగ్నమైనది! ఎన్నోసారులు నేను విమర్శించుకొన్నాను, నామనస్సు మీమీదికి ఏల పరుగులు పెట్టవలె నని? సూర్యుని చుట్టూ గ్రహాలు ఎందుకు తిరుగుతున్నవి? నదులన్నీ సముద్రమునే ఏల చేరుతున్నవి? అయస్కాంతము ఇనుమును ఏల ఆకర్షించవలె? దీనికి సమాధాన మేమి అనుకొన్నాను.

"దుష్యంతుడు ఎందరు స్త్రీలను చూచి వుండలేదు? అతనిమనస్సు శకుంతలపైనే లగ్నము కావడం ఎందుకు?

"ఇది ప్రకృతి శాసనమా? పూర్వజన్మ వాసనా? పూర్వజన్మాన మనము భార్యాభర్తలము కాబోలు! మనోహరా, మీదివ్య మంగళరూపము నాహృదయాన పాదుకొన్న నాటినుంచీ మీపవిత్రనామము సంస్మరిస్తున్నాను. పంచాక్షరీమంత్రము పారాయణ చేస్తున్నాను.

ఎన్నటి కైనా నాతపస్సు ఫలించునా? ఎన్నటికైనా నానోములు పండునా? ఎన్నడైనా నేను మీపాదాలను ఆశ్రయించగలుగుదునా? ఎన్నటికైనా నాహృదయము మీపాదములమీద ధారపోయ గలుగుదునా? ఆదిన మెప్పుడు వచ్చును? ఆపవిత్రదినము రావలె నని ఎంత శోషిల్లుతున్నాను! ఆశ కోల్పోతున్నాను. మనోహర మూర్తీ! నా కాశ యివ్వండి! కుంగిపోతున్నాను; నన్ను లేవనెత్తండి! నాథా, సెలవు! మీదివ్యలేఖని సత్వరము గా నాకు ఉత్సాహమూ ఊరటా కూర్చునుగాక!

మీదాసి

శ్యామల."

ఈలేఖ చదువుకొని సంతసించినానే కాని అం దున్న సందేశము గ్రహించజాలనైతిని. "ఆదిన మెప్పు డువచ్చును?" ఎన్నడూ రాదు అనేసంగతి నేను గ్రహిం చజాలనైతిని! ఎన్నడూ రాదా? రాదా! ఆశ నిరాశ అయిందా? లోకములో చీకటి క్రమ్మిందా? ఎన్నడూ ఆదినము రాదా? అయ్యో, ఎంతటిపాపిని! ఎంత దుర దృష్టవంతుడను! ఎన్నడూ ఆదినము రాదా? అయ్యో, నేను మొదట గ్రహించలేక పోతినే! దైవప్రేరణచేత వ్రాసింది కాబోలు ఆవాక్యము! ఎన్నడూ రాదా! ఈజ

న్మలో గాకున్నా వచ్చే జన్మలోనయినా రాదా! రాక పోవునా? వచ్చును, వచ్చును, వచ్చితీరును!

౪

ఆశాలతలు ఒకటివెనుక ఒకటి పుటుకు పుటుకున తెగి పోవుతున్నవి. హృదయం అల్లకల్లోల మవుతున్నది.

శ్యామల చెన్నపట్టణపు పెద్దఆసుపత్రిలో రోగగ్రస్తయై మంచముపైన పడి వున్నది. నేను ఆసుపత్రిలో మతిపోయినవాడివలె సంచరిస్తున్నాను. ఆలేఖ వ్రాసిన రెండుదినాలలో పిడుగువంటి వార్త నాచెవిని పడినది.- శ్యామల జబ్బుపడి రాయదుర్గంనుంచి చెన్నపట్టణము వస్తున్నదని- ఆవార్త చెవిని పడిన పిమ్మటకూడా నే నిట్లు జీవములతో సంచరిస్తున్నాను. శ్యామల రోగగ్రస్తురాలా! నాశ్యామల! నేను ప్రేమించిన శ్యామల! నేనెవ్వతె రూపమును చూచి ప్రాణములు పోసుకొంటున్నానో ఆనాశ్యామల! అయ్యో! భగవంతు డున్నాడా?

ఆసుపత్రిలో రంమారావు నాస్నేహితుడు. అతని నెవ్వుడూ ఉపకారము చేయమని కోరలేదు. ఇప్పుడు కోరితిని. శ్యామలను చూడడానికి అనుజ్ఞ యిమ్మని.

అతను నన్ను సమయము చూచి శ్యామల వరున్నగది లోకి తీసుకొనిపోతూ వుండును. ఆమెగదిలో నేను పావు గంట ఉండేవాడను. తరువాత ఆసుపత్రి ప్రాకారాల చుట్టూ తిరుగుతూ వుండేవాడను. ఉదయమున ఆసుపత్రి తలుపులు తీయుటకు ముందు గుమ్మముకడ వేచియున్నవా డెవడు? నేనే! అర్థరాత్రి ఆసుపత్రి గోడ పక్క నిలుచుండి బాష్పధారలు వర్షించేవా డెవడు? నేనే! మధ్యాన్నకాలాన చండకిరణుని వేడిలో శ్యామలను ధ్యానము చేస్తూవుండేవా డెవడు! నేనే! శ్రమకు ఫలం ఉండునందురే! ఎక్కడ నాశ్రమకు ఫలము! ఆశీస్సులకు ఫలము! భగవంతు డున్నాడా?

శ్యామల మంచముదగ్గర నిలుచుంటిని. అరమోడ్చిన కనుదోయి విప్పి చూచింది నన్ను నాశ్యామల. ఆచూపులే నాదేహమును కంపింపజేసినవి. శుష్కించిన హస్తముతో నాహస్తము పట్టుకొన్నది శ్యామల. నాదేహము స్పందించినది.

నవయౌవన తేజోవిలాసిని నాశ్యామలకా ఈపాట్లు! ఆమెముఖంవైపు ముఖం త్రిప్పలేకపోతిని. కన్నీటిమబ్బులు కన్నుల గమ్మెను. గద్గదస్వరముతో 'శ్యామలా' అంటిని. శ్యామల కళ్లు మూసింది. మూసినకనురెప్పలలో నుంచి ఒకబాష్పకణము కొలుకులగుండా జారి

మంచముపైన పడినది. కన్నులు దెరచి "మనోహరా" అన్నది. నేను కొంతసేపటిదాకా మాట్లాడలేకపోతిని. నాహృదయంమాత్రమామెహృదయంతో సంభాషిస్తూన్నది. "ఎట్లుంటివి? జబ్బు ఉపశమిస్తున్నదా?" అంటిని. "దుఃఖము వద్దు. నిజము చెప్పుతున్నాను. నాకాయువు చెల్లింది. మనఋణము తీరింది!" అన్నది. నేను చేతులతో తల మోదుకొంటూవుంటే 'నాథా' అన్నది. రామారావు వచ్చి నన్నవతలకు తీసుకుపోయినాడు.

ప్రభంజనం అతితీవ్రంగా వీస్తున్నది. వాయుదేవు డొక్కమారు తనసేవకులను లోకముపైకి విడిచినట్లు ఉన్నాడు. దశదిశలనుంచీ ఝుంఝూ నిలము కొట్టుతున్నది. పంచభూతాలూ ఒక్కమారు మహాసంగ్రామంలో ఒకదాని నొకటి ఢీకొన్నవి. నవనవలాడే పూలమొక్కలు పూలురాల్చి మలినములైనవి. మహావృక్షములు దీనస్వరము చేస్తూ భూమిమీదకి కుంగిపోతున్నవి.

ఆసుపత్రిలో ఆరుబయట మబ్బులవెనుక వున్న సూర్యునికేసి చూస్తూ నిలబడినాను. వాయువు నన్ను నిలవనివ్వక తీవ్రంగా అన్నివైపులనుంచీ కొట్టుతున్నది. వానచినుకులు తుపాకిరవ్వలవలె మొగముపైన తగులుతున్నవి. భూమి తన రేణువులు పైకెత్తి నన్ను

గట్టిగా మోదుతున్నది. సూర్య తేజము మబ్బుల చాటు నుంచి బయలువెడలి నాకళ్ళలో పొడుస్తున్నది. భూతములు నాపైన ఆగ్రహించినవి. భూతములు నన్ను వేధిస్తున్నవి. వేధించనీ! సూర్యభగవానుడే ఆధారమని మనస్సు దిటవుచేసుకొని అతనివైపు కన్నులు తిప్పి ప్రార్థిస్తున్నాను. "లోకాని కంతకూ జీవనము ఒసగగలనీవు నాశ్యామలజీవనము అపహరించడం న్యాయమా భగవానుడా! ఆమె తేజము నీలో కలుపుకో ఇచ్చగిస్తా వేల? నీకు తేజము కొరతపడినదా? ప్రాణికోటికి అంతకూ బంధువుడవై ఒక్క నాయెడల శత్రుత్వము వహించడానికి ఏమపరాధం చేశాను? భగవంతుడా, నా ప్రార్థన వినవా? నాశ్యామలను నా కివ్వవా? నీ కేమి సమర్పించ మంటావు? ఏదైనా నీకర్పణ చేయడానికి సిద్ధంగా వున్నాను. దయ రాదా? నాశ్యామలను నా కివ్వవా?"

రామారావు వచ్చి చెయ్యి పట్టుకొన్నాడు. అతని ముఖము వెల్లబారివున్నది. నన్ను గదిలోకి వెళ్లమని సైగ జేసినాడు. ధైర్యము పూనమన్నాడు. అయ్యో! ఇంకా నాకు ధైర్యమా? మంచముపైన చలనము లేక పడివున్న నాశ్యామలను ఆఅవస్థలో చూస్తున్న నాకు ధైర్యమా? పుష్పము వాడిపోయింది. దానికాంతులు

మాయ మైనవి. శాంతమూర్తివలె పరుండి వున్నది నాశ్యామల. గుమ్మముదగ్గర నిలుచుండి చూస్తిని. మంచముచుట్టూ ఆమెబంధువు లున్నారు. మంచమువక్క దొరసాని నిలువబడి మందులు తాగిస్తున్నది. మందులు వంట బట్టడము లేదు.

మృత్యుదేవత ఈకబళాన్ని ఆశించింది. మృదుగాత్రులను నోటవేసికొంటే గాని దాని ఆకలి ఉపశమించదు కాబోలు!

అయ్యో, భగవంతు డున్నాడా? ఉంటే నాప్రార్థన ఏల వినకున్నాడు? ఆమెప్రాణము నిల్పడానికి నాప్రాణాలు త్రికరణశుద్ధిగా ధారపోస్తా నంటున్నానే! విన డేమి భగవంతుడు! ఆవిడరోగాన్ని మరల్చి వెయ్య మంటున్నానే, ఆరోగము నా కివ్వమంటున్నానే విన డేమి భగవంతుడు! ఆమెబాధలన్నీ నేను భరిస్తా నంటున్నానే! ఆమెను కష్టములనుంచి విముక్తి చెయ్య మంటున్నానే? అమెబాధ చూసి సహించలేకున్నానే! ఆ బాధలు మింగివేస్తా నంటున్నానే! విన డేమి భగవంతుడు!

మంచాని కెదురుగా నిలబడితిని. శ్యామల నన్ను చూచింది, చెయ్యెత్త లేకపోయింది. ఆచేతిని

నాచేతుల్లో ఇముడ్చుకొన్నాను. ఆమె నాచేతిని మెల్లగా నొక్కింది.

దొరసాని పెదవి విరిచి బయటికి వెడలిపోయింది. అవసానము సమీపిస్తున్నది. నాఆశ రెక్కలు కట్టుకొని ఎగిరిపోయింది. కొయ్యబొమ్మవలె నా శ్యామల కేసి చూస్తూ నిలబడ్డాను.

రంయిమని గాలి వీస్తూ ఆనుపత్రిని ఇటుఅటూ ఊగిస్తున్నది. శ్యామల నావైపు కళ్ళు తిప్పింది.

అయ్యో దైవమా! ఆమెను ఇంకొక్కనిమేషము బతకనివ్వవా? నాజీవములు ధారపోస్తాను; ఆమెను ఒక్కమాసము బతకనివ్వవా? నాసర్వస్వము నీ కర్పణము చేస్తాను. ఆమెను ఇంకొక్క రోజైనా బతకనివ్వవా? ఇంకొక్కగంట, ఒక గడియ, బతకనివ్వవా? అయ్యో!

ఆమె నాపైన వుంచిన దృష్టులు మరల్చలేదు. ఇంకెవ్వరినీ చూడడంలేదు. నాకేసి చూస్తూ చూస్తూ ఉండగా అప్రయత్నంగా ఆమెకనురెప్పలు మెల్లగా వాలిపోతూ వున్నవి. కనురెప్పలు మూసింది. లోకమంతా చీకటి గమ్మింది. సూర్యుడాకాశము విడిచి ఎక్కడికో పోయినాడు. వాయువు ప్రచండంగా ఘోష పెట్టుతున్నది!

నాకింద వున్న భూమి విచ్చిపోయింది! ఆ అఖాత ములో పడ్డాను!

*     *     *     *

శ్రీధరరావుగారు ప్రేమించిన మహారాష్ట్రయువతి పేరు శ్యామల కాదనీ ఆమెపేరు వెల్లడిచెయ్యడానికి ఇష్టము లేక మారుపేరు పెట్టినారనీ ముకుందరావు గారు చెప్పుతున్నారు.

తమజీవితములో ఒక్క అంశమే వ్రాసివుంచి శ్రీధర రావుగారు దానికి స్వకీయచరిత్ర అని పేరుపెట్టినారు. జీవితమున కంతకూ మూలాధారమైన ఈ అంశమే ముఖ్యాంశముగా వారు గ్రహించడముచేత అలా పేరు పెట్టివుండ వచ్చును.

౧౯-౨౦

# ముద్దు

## ౧

"అనగనగా వకరాజు. ఆరాజుకు ఏడుగురు—"

"అవును, ఆలాగే! నాకు తెలుసులెండి ఆకథ, మీరు చెప్పక్కరలేదు!" అన్నది నాభార్య.

రాత్రి భోజనముచేసి, ఆఫీసు కాకితాలు చూచుకొంటూ కుర్చీలో కూర్చున్నాను. నాభార్య కుర్చీ వెనక నిలుచుని తమలపాకులు చుట్టిస్తూ కథ చెప్పమన్నది. జరూరుకాకితాలు చూచుకొంటూ ఉండడము మూలాన మంచి కథ తోచకపోతే అమ్మమ్మకథ ఒకటి మొదలుపెట్టినాను. మాఅమ్మమ్మ బతికి ఉన్న కాలములో నన్ను కూర్చోబెట్టి ఎన్నో కథలు చెప్పింది. చాలాకథలు మరిచిపోయినాను. ఇప్పుడంతా కలెక్టరాఫీసు కథతప్ప మరేకథా లేదు. ఇలాంటివిషయములో నన్ను కథ చెప్పమంటే ఏలాగు చెప్పడము? అయితే నాభార్య ఎప్పుడేది కోరితే అప్పుడది చెల్లించడము నామతము. నాభార్యకు చిన్నతనము; ఆకారణముచేత వేళాపాళా లేకుండా ఆవిడ కథ చెప్పమనీ, ఇది చెప్పమనీ అది చెప్పమనీ ఉంటుంది యక్షప్రశ్నలు

వేస్తూ ఉంటుంది. ఆమెమాట కొట్టివేయ లేక ఏదో కుక్కకథా,నక్కకథా చెప్పి తృప్తి చేసేవాడను. ఏకథ చెప్పినా ఏసమాధానము చెప్పినా విని ఆనందించడము ఆమె కలవాటు. ఆవిడ ఒకనాడు నాదగ్గిరికి వచ్చి, ‘నే నొక్కమాటచెప్పుతాను, కోపపడరు గదా!’ అన్నది.

‘ఊహు’ అన్నాను.

‘అయితే, మరి రైలుబండి పరిగెత్తుతుంది గదా, దానికి గుర్రాలు కడతారా, ఎద్దులు కడతారా లాగ డానికి? చెప్పండి.’

‘గుర్రాలనూ కట్టరు,ఏనుగలనూ కట్టరు. ఆవిరిశక్తి వల్ల నడుస్తుంది అది—’

‘మీరు చెప్పక్కర లేదు, నేనే చెప్పగల. దానికి ముందర సింహాలనూ పెద్దపులులనూ కట్టుతారు. అవి లాగుతవి.’

‘అయితే అవి లాగుతున్నట్టు కనపడ వేమి?

‘ఇంజరములో వుంటే అవి ఎలా అవుపడతవి!’

వట్టి వెర్రిపిల్ల! ఇకప్రస్తుతాంశము. నేను చెప్పబోయే కథ నాభార్య గ్రహించి మీరు చెప్పక్కర లేదన్నది. అయినా కాదని బొంకి తప్పించుకొనవలె ననీ, కొత్త

కథ చెప్పవలె ననీ సంకల్పించుకొని ముందున్న కాకి తాలు దూరముగా పెట్టి ఆలోచిస్తూ అన్నాను: 'నేను చెప్పబోయేకథ నీకు తెలును నన్నావు గదా, ఏమిటో చెప్పు!'

'చెప్పనా! అనగా అనగా నకరాజు, ఆ రాజుకు ఏడుగురు కొడుకులు, ఏడుగురు కొడుకులూ వేటకు వెళ్ళారు—'

'ఆగు, ఆగు! అదికాదు నేను చెప్పబోయేది.'

'అదే, నాకు తెలుసు. ఇంకొకటి కాదు. అదే అదే!'

'కాదంటూ వుంటే!'

'మీరు చెప్పేకథ అదే. కావలిస్తే పందెం వెయ్యండి!'

ఇదివరలో ఇలాంటిపందెములు వేసుకొనడము మా కలవాటే. రూపాయలపందెము ఒక మాటూ, చీరెలు కొనేపందెము ఇంకోమాటూ, నగ చేయించే పందెము మరోమాటూ, అయినవి. ఈమాటు కొత్త రకపు పందెము వేయవలె ననుకొని, 'సరే, పందెం ఏమిటి చెప్పు' అన్నాను.

'మీరే చెప్పండి. మీరు చెప్పే దేదో అదే పందెం. నేనూ ఒప్పుకుంటాను.'

‘అలా గయితే విను. ఇదివరకల్లా బట్టలూ, నగలూ పందెం వేసి నాదగ్గర పుచ్చుకొనేదానవు. ఇప్పుడు నీవు నా కియ్యవలె, నేను గెలిస్తే ఏ మడిగితే అది నీవు నా కియ్యవలె. మరి తిరగకూడదు!’

‘సరే, చెప్పండి, చెప్పండి కథ.’

తప్పని సరి గదా అని కథ అల్లడము ప్రారంభించాను. నేను పడ్డపాట్లు ఆపరమాత్ముడికే ఎరుక! కథ చదవడమైనా, చెప్పించుకొనడమైనా మహాచులకనగా ఉండేది. కల్పించి క్రొత్తకథ చెప్పడమంటే ఎంతకష్టమో ఇప్పుడు నాకు అనుభవంలోకి వచ్చింది. తమలపాకులు నములుతూ, నట్లు పడుతూ కథ ప్రారంభించాను. నాభార్య ఊఁకొట్టుతున్నది.

౨

“అనగనగా ఒకరాజు. ఆరాజుకు ఏడుగురు భార్యలు. అందులో చిన్న భార్య అంటే ఆయనకు చాలా యిష్టము. అందుచేత ఎప్పుడూ చిన్న భార్య అంతఃపురములోనే వుండేవాడు రాజు. అన్నట్టు చెప్పడము మరచి పోయినాను! ఆరాజు ఏడుగురు భార్యలకూ ఏడు మేడలు కట్టించినాడు. చిన్న భార్యకు ఒంటిస్తం

భము మేడ. మేడచుట్టూ తోట. తోటలో పక్షులు లేళ్ళూ, కుందేళ్ళూ ఎప్పుడూ వుండేవి."

"రాజుగారు మేడ కట్టించారని తిరగడానికి వచ్చినవి కాబోలు తోటలోకి లేళ్ళూ, కుందేళ్ళూ!" అన్నది నాభార్య ఆక్షేపణగా.

"కాదు. రాజుగారు వాటిని పెంచుతున్నారు. అవి యెప్పుడూ తోటలోనే తిరుగుతూ వుండేవి. తోటలో పెద్దసరస్సు తవ్వించినాడు, ఎంతో చక్కటిది! దానికి నాలుగువైపులా రాతిమెట్లు కట్టి, వాటి మీద పూలమొక్కలకుండ్లు పెట్టి అలంకరించినారు. నీటినిండా తామర పూలు; ఎర్రతామరలు, తెల్ల తామరలు, పచ్చతామరలు."

"అ దేమిటి? పచ్చతామర లుంటవా?"

"రాజుగారు కాశ్మీరదేశమునుంచి వాటిని తెప్పించి, వేశారట. ఆ పచ్చతామరలు బంగారములాగు వుంటవి."

"అబ్బా! ఇవన్నీ ఎందుకు? కథ చెప్పాదురు!"

"ఇది కథ కాదూ? మరి కొనకూ విను. ఆవొంటి స్తంభము మేడలో చిన్న రాణి నౌకర్లతోటీ, చాకర్లతోటీ, దాసీలతోటీ, హాయిగా కాలము గడుపుతూ వున్నది. చెలికత్తెలతో జలక్రీడలూ పక్షులతో మా

ట్లాడడమూ, రెండుపూటలా పూలు కోయ్యడమూ దండలు గుచ్చడమూ, లేళ్ళతో ఆడుకోనడమూ. ఈవిధముగా కాలము గడుపుతూవున్నది. ఒకనాడు వక బ్రాహ్మడు చిన్నరాణీ మేడలోకి వచ్చినాడు. ఆయన పెద్ద జ్యోతిష్కుడట. తనమీద రాజుగారికి ఎప్పుడు దయ కలుగుతుందో చెప్పమని చిన్నరాణి దాసీద్వారా బ్రాహ్మడికి కబురు పంపింది."

"అదేమిటి? రాజుగారికి చిన్న భార్యమీద మమకారమని చెప్పినారు కాదూ? అందుచేతనే ఆవిడ అంతఃపురములో—"

"అవును, అన్నట్టు మరిచిపోయినాను. రాజుగారికి చిన్నభార్య అంటే చాలా ఆపేక్ష!"

"ఆ, అమ్మా, చూశారా! కథ చెప్పమంటే ఏమిటో కల్పించి చెపుతున్నారు. ఇది నిజంకథ కాదు."

"చివరదాకా విను. ఇది నిజంకథే. నిద్రమత్తున ఒకటి చెప్పబోయి ఇంకొకటి చెప్పినాను. ఏదీ, ఆఁ! చిన్నభార్యమీద ఆపేక్షమూలానే రాజావిడకు మంచి మేడ కట్టించినాడు. ఆమేడలో గోడలమీద చెక్కినారుట రకరకాల బొమ్మలు. వేటితో అనుకున్నావు, మాణిక్యాలతో! మిగిలిన భార్యలు ఆరుగురికీ చిన్న భార్యమీద కోపము వచ్చింది. అందులో పట్టపురాణీ

కి మరీకోపము వచ్చింది—అసూయకూడా. ఓరవలేని తన మనేది అంటువ్యాధి వంటిది; చెవిలోనుంచి లోప లికి ప్రవేశిస్తుంది. ఈపురుగు చెలికత్తెల మాటలద్వారా మనస్సులో ప్రవేశించి తొలవడం ప్రారంభిస్తుంది. అక్కడినుంచి పుట్టుకువస్తవి కొత్తకొత్త జబ్బులు! కోపాలూ, శోకాలూ!"

"ఏమిటి, కథ మానివేసి జబ్బులసంగతి చెప్తారు! చెప్పేటందుకు కథ లేకపోతే వర్ణనలు ఎక్కువవుతవి. నాకు నిద్ర వస్తున్నది. చప్పున చెప్పండి కథ. మీా రెప్పుడూ ఇంతే!"

"అవును, పొరపాటు పడ్డాను. పట్టపురాణీకి ముఖ్యంగా క్రోధం పుట్టింది. ఆమె యెలాగయినా కసి తీర్చుకోవలెనని ఆలోచించింది. ఎలాగు తీర్చుకోవడము?—"

తరవాత నాకు కథ నడిపింది కాదు; కసి ఏలా తీర్చుకొనేలాగు చేస్తే బాగుంటుందో ఆలోచించ కాదు. అప్పుడు కొంచెము గడుసుతనం చేసి నాభార్యకు ప్రశ్న వేశాను, "కసి ఎలా తీర్చుకొంటుందో నీవు చెప్పు!"

"చెప్పనా, చెప్పనా! చంపించవలెనని ప్రయత్నం చేసింది" అన్నది.

"కాదు, మళ్ళీ ఆలోచించి చెప్పు."

"ఏమిటి, చెప్తా! మరి, రాజుగారిని అక్కడికి వెళ్ళకుండా చెయ్యవలెను అనుకొన్నది. అవునా?"

"కాదు. వెళ్ళకుండా ఎలా చేస్తుంది?"

"తనదగ్గిరే ఆడుతూ పాడుతూ కాలము వెళ్ళబుచ్చేలాగు చేస్తే సరి."

"రాజు అస లావిడదగ్గిరికి రావడమే లేదే."

"అవును, అన్నట్టు! కసి తీర్చుకోవడము ఎలాగు?"

"చెప్పుకోవలె మరి."

"ఆఁ, ఈమాటు తెలిసింది. పారిజాతాపహరణములో కథ చెప్పినారుగాదూ; సత్యభామలాగున మాసినచీరె కట్టుకొని తలకట్టు కట్టుకొని, పండుకొంటే సరి. రాజువచ్చి విసనకర్రతో విసురుతూ అలకతీరుస్తాడు. అప్పుడు చిన్న భార్యకు బుద్ధి చెప్పినట్టవుతుంది."

"మహాబాగా చెప్పావు! రాజు కృష్ణమూర్తిలాగున వెర్రిగొల్లవాడు అనుకొన్నావా యేమిటీ—విసనకర్ర పుచ్చుకొని విసురుతూ, ఎడమకాలి తాపులు తిని అలక తీర్చడానికి?"

"నాకు తెలియదు. మీరు చెపుదురూ!"

నాభార్య చెప్పిందల్లా కొట్టివేశాను. ఇప్పుడు నేను మాత్రము కధ చెప్పడము ఎలాగు? కొంచె మాలోచించి ఎలాగో కధ సాగించాను. "పెద్దభార్య కసి తీర్చుకోవడానికి ఆలోచించింది. తనవక్కర్తె వల్లాకా దనుకుంది; అనుకుని చెలికత్తెను పిలిచి ఆలోచన అడిగింది. కుట్ర చెయ్యడానికి ఇద్దరుమనుషు లుండవలె. ఒకడికి ధీమా రెండోవాడు. ఒకడు చెప్పినదానికి రెండోవాడు తల వూపితేనే గాని మొదటివాడికి వుషారీ పుట్టదు. ఇద్దరూ వకమోస్తరు మనుషులు కావలె. దొంగకు దొంగవాడే స్నేహితుడు. దుర్మార్గుడికి మంచివాడితో స్నేహము పొసగదు, [illegible] విషమిస్తుంది......"

"ఏమి టివేదాంతం, కథ చెప్పక! రాణీ కసి తీర్చుకోవడము సంగతి మాని వేసి వేదాంతంలోకి దిగినారు! మీకు కథ నడపడం లేదు!" అన్నది నాభార్య.

"అవును, మరి వూరికే అన్నారూ ఆడవాళ్ళకు చలచిత్త మని! రవ్వంతసేపు ఓపిక పట్టలేవు కదా! కథో కథో అంటావు! ఈచెప్పేది కథ కాదూ!"

"ఔను, ఆడవాళ్ళకి చలచిత్తమే—మొగవాళ్ళమోస్తరే. మీరు వెళ్ళే దారిని వెళ్ళనియ్యకపోతే తిరగబడతారు. నా కెందుకు లెండి—మీాయిష్టం వచ్చి

నట్టు కథ చెప్పుకోండి! నాకు నిద్ర వస్తుంది. నేను వెళ్ళి పడుకుంటాను."

"వెళ్ళితే ఎరగవ్వూ! పందెం వేశా వన్నమాట మరిచిపోయినావు కాబోలు!"

"నిజంకథ అయితే పందెం కాని కల్పనాకథకు పందెం ఏమిటి?"

"నిజంకథో, కల్పనాకథో నీ కెలా తెలిసింది?"

"కల్పనాకథ కాబట్టే పాపము! మిమ్మలిని ఎక్కడికక్కడికి చిక్కులు పెట్టుతున్నది! ఇదివర కెన్నికథలో చెప్పినారు. ఎప్పుడైనా ఇలాటికథ చెప్పినారా?"

"ఆకథ లన్నింటికంటే మంచి దిది. అందుచేత కొంచెం విపులంగా చెప్పుతున్నాను."

"అదుగో, కబుర్లలోకి దింపుతారు గాని కథ చెప్పరు. నే ఎరగనా యేమిటి!"

"సరే చెపుతా విను. కథ ఎందాకా అయింది?"

"అనడమే కాని అన్నమాట జ్ఞాపకం వుంచుకోవడం లేదు. ఇప్పుడే కాదూ ఆడవాళ్ళకి చలచిత్తం అని దెప్పిపొడిచారు!"

"సరేలే! కథ యెక్కడ వదిలి పెట్టాను?"

"పెద్దరాణీ దాసీదానితో......"

"అవును, అన్నట్టు పెద్దరాణీ, దాసీదీ కలిసి కుట్ర పన్నారు. ఇద్దరూ పురుషవేషం వేసుకొని కోటలో నుంచి నిమ్మళంగా బయిటికి వెళ్లుదాము అనుకొన్నారు."

"వెళ్ళి?"

"తొందర పడకు! చివరదాకా విను—వెళ్ళి, కోట వెలపల బట్టలు మార్చివేసి, కాపుస్త్రీలలాగు వేషం వేసుకొని రాజుగారు తీర్పులు చెప్పుతూ వుండే సమయానికి సభలోకి వెళ్ళదలుచుకున్నారు."

"అయితే, చిన్నరాణీమీద కసి తీర్చుకోవడం ఎలాగు?"

"సి కెక్కడా లేనితొందర!"

"రాణివాసంలో బతికింది గదా, అందులో పట్టపు రాణీగదా, సిగ్గూ భిడియమూ విడిచి నిండుసభలోకి ఎలా వెళ్ళవలె అనుకున్నది?"

గట్టిచిక్కే! సంగతి మరిచిపోయి పూర్వాపరసందర్భము చూసుకోకుండా ఏదో అన్నాను. నాభార్య వేసిన సవాలుకు మళ్ళీ ఆలోచించి సమర్థించుకొనడానికి ఇలా చెప్పినాను: "ఎలా వెళ్ళా లనుకొన్నదా, చక్కనిచుక్కలాగ."

"అది కాదండీ. వెళ్లితే నలుగురూ ఏమయినా అనుకుంటా రని వుండదూ!"

"పట్టు వచ్చిందంటే ఆడవాళ్ళు ఎంతపనైనా చేస్తారు. అయినా నలుగురికీ తెలిసేలాగు వెళ్ళతారా యేమిటి! మారువేషం వేసుకొని......"

"రాజు ఆనవాలు పట్టలేదు కామోసు?"

"కావుదానిలాగు వేషం వేసుకుంటే రాజు ఎలా గుర్తు పడతాడు?"

"సరే, కానియ్యండి."

"అడుగడుగుకూ ఇలా సవాళ్లు వేస్తుంటే కథ యేమి సాగుతుంది? చెప్పిందేమో మరిచిపోతాను, చెప్పబో యేది తోచకదు."

"తెలియకపోతే అడగకూడదూ?"

"అడగవచ్చు. మరి వేళా పాళా లేదూ?"

"సరే, ఎప్పుడూ ఇలా సాధిస్తూ వుంటారు! కథ కానియ్యండి."

"ఆలాగు వాళ్ళిద్దరూ రాజుగారి సభలోకి వెళ్ళా లనుకొన్నారు. అంతే కాకుండా, చిన్నరాణీకి జాబు వ్రాతామనుకొన్నారు, ఎవరిపేరైనా పెట్టి తెలియకుం డా. ఆఁ, ఎవరిపేరు...జ్ఞాపకం వచ్చింది. దేవుడు వెం కటేశ్వర్లపేరు బెట్టి అలా చేతా మనుకొన్నారు."

"ఉత్తరం ఏమని?"

"అంతా యిప్పుడే చెప్పేస్తే ఇంకా కథేమిటి?"

"చెప్పకపోతే దాచుకోండి!"

"అదేమిటి మళ్ళీ ఆవికారం!"

"వికారమే మరి. ఎప్పుడేమి అడిగినా అలాగే. చెప్పమంటే చెప్పరు."

"చెప్పుతున్నాను కాదూ! విను. పట్టపురాణీదాసీ ఒకనాడు చిన్నరాణీ దాసీయింటికి వెళ్ళింది. చిన్నరాణీ దాసీదాన్ని చూచి, 'పెద్దరాణీగారి దాసీగారు కాబోలు. మాయింటికి వచ్చారేమి?' అన్నది.

'పేరు పట్టపురాణీదాసీ అనడమే కాని ఘనమా, మెప్పా! చిన్నరాణీగారు సుఖంగా వున్నారా?'

'ఆవిడకు సుఖం కాకేమి! రాజుగారు ఆమె కనుసన్నల తిరుగుతున్నారనే ఆవిడకు ఎక్కడా లేని గీర్వాణం, గర్వం!'

'ఏమి, అలా అంటున్నావు!'

'అననా యేమిటి! అడ్డమైన చాకిరీ చేయించుకోవడమూ, ఎంత చేసినా మెప్పు లేకపోవడమూ! పెద్దరాణీగారిదగ్గర వున్నప్పుడు ఎంతో సుఖపడ్డా నమ్మా!'

'పెద్దరాణీగారు నీదగ్గిరికి నన్ను పంపించారు. నీకు కానులపేరు బహుమతీ యిమ్మన్నారు!'

‘నిజంగానా?’

‘నిజంగానే. ఆవిడకు నీవల్ల వకకార్యం కావలసి వుందట.’

‘ఏదీ అక్కా! ఎంతబాగుంది! ఈకానులపేరేనా నా కివ్వమంట?’

‘ఇదే, నీవు పుచ్చుకోవలె. ఇదిగోచూడు, ఈవు త్తరం చిన్నరాణీగారి పరుపుమీద వుంచాలి. దీన్ని బట్టి వ్యవహారం నడిపించాలి.’

‘అ దెంతసేపు!’

“తర్వాత పెద్దరాణీ, ఆవిడదాసీ కలిసి, అదివర కనుకొన్నట్టు సభలోకి వెళ్ళినారు; వెళ్ళి రాజుగారితో మొరబెట్టుకొన్నారు.”

“ఇద్దరూ వకమాటే మొరబెట్టు కొన్నారా!”

“లేదు. పెద్దరాణీ మొరబెట్టుకుంది. దాసీ సాక్ష్యం పలికింది.”

“ఏమని మొర?”

“భర్త తన్ను ఒల్లడం లేదనిన్నీ, ఎవర్తెనో వల చినాడనీ. ఎందుకు ఒల్లడం లేదని రాజుగారు అడిగి నారు. తన తప్పు ఏమీ లేదనీ, ఇంకో చిన్నపెళ్ళాము దొరకడమే కారణ మనీ ఆమె చెప్పింది. అప్పుడు రాజుగారు అన్నారు: ఇద్దరు భార్యలను పెండ్లాడడ

ముబట్టి ఇద్దరినీ ఒకవిధంగానే చూడవలసి వుంటుందనీ, పెద్దదాన్ని ఏలకపోవడం తప్పనీ, వాడిని దండిస్తాననీ. ‹బంగారానికే తుప్పు పట్టితే ఇనుముగతి ఏమి కావలసింది?' అని వాళ్లు అక్కడినుంచి వెళ్ళిపోయినారు. రాజుకు అప్పుడు కొంచెం అనుమానం కలిగింది; కాపురి తన పెద్దభార్యేమే అనుకొన్నాడు."

"నే చెప్పలేదూ, ఆనవాలు పడతాడని?"

"చెప్పావు. అయితే ఎక్కడ చెప్పవలసింది అక్కడే చెప్పవలె, ముందు చెప్పకూడదు.—ఆఁ, అనుమానం పుట్టి తనపెద్దభార్యను తిన్నగా చూడక పోవడం దోష మని రాజుకు తోచింది. కాపువాడిని తాను దండిస్తా నన్నట్లే తన్ను దైవం దండిస్తాడేమో అనుకొన్నాడు రాజు."

"అదివరకు పుట్టిందికాదు కాబోలు ఈబుద్ధి!"

"పుట్టివుంటే ఏబాధా లేకపోను. పుట్టకపోబట్టే నేను కథ చెప్పడమూ, నీవు వినడమూ తటస్థించింది!- తరువాత చిన్నరాణీ పక్కమీద పడివున్న వుత్తరం చూసి, విప్పి చదివింది.

"నాభర్తురాలైన చిన్న రాణీని, తిరుపతివెంకటేశ్వర్లు దీవించి వ్రాసేది యేమనగా :

"రాజు నీమూలాన పెద్దరాణీని నిర్లక్ష్యము చేస్తూ వున్నాడు. ఆవిడఉసురుకొట్టి నీవు చెడిపోతావు. కాబట్టి నీవు రాజును పురికొల్పి, ఏడుగురు రాణీలను ఆయన ఒక్కమోస్తరుగా చూసేలాగున చేయవలసి వుంటుంది. భక్తురాలవు కావడముచేత నీకు స్వయముగా వ్రాస్తున్నాను.

తిరుపతి వెంకటేశ్వర్లముద్ర."

"ఈవుత్తరము చదివేటప్పటికి చిన్నరాణీ పైప్రాణాలుపైన పోయినవి. అప్పుడు దాసీదాన్ని పిలిచింది రాణీ. వింటున్నావూ? కునికిపాట్లు పడుతున్నావు, చూశావూ!"

"కునికిపాట్లూ లేవు గినికిపాట్లూ లేవు. మూబాగా వన్నారు కుట్ర!" అన్నది నాభార్య.

"ఆడవాళ్ళు గట్టివాళ్లు కారూ, మరి?"

"కానిస్తూరూ కథ. ఎప్పుడూ ఆడ వాళ్ళను దెప్పడమే మీపని."

"చిన్నరాణీ దాసీదానికి కబురుపంపి ఉత్తరం పక్క మీదికి ఎలా వచ్చిందని అడిగింది. అది యిలా చెప్పింది. తాను పొద్దునే లేచి గదివైపు వెళ్ళిందట. ఎవరో గదిలోకి వెళ్ళారట. పచ్చనిబట్ట, చేతులో పిల్లంగోవి, నీలమేఘం లాటి శరీరమూ చూసి ఎవరు చెప్తా లోప

లికి వెళ్ళారని తాను గదిలోకి వెళ్ళితే ఎవరూ కనబడ లేదట. అప్పుడు చిన్నరాణీకి భయం వేసింది. నిజంగా వెంకటేశ్వర్లేవచ్చి ఉత్తరం అక్కడే పెట్టి వెళ్ళినాడని ఆమె అనుకోవడములో వింతేమి? సరే. రాజు బుద్ధి మరల్చాలి అనుకున్నది."

"మరిల్చిందా?"

"ఆడవాళ్లు తలుచుకొంటే ఏ పనికాదు?"

"మళ్ళీ ఆడవాళ్ళమాటే!"

"అయినా మరల్చడానికే ముంది, ఆయనబుద్ధి మారే వున్నది."

"అంతేనా కథ?"

"అంతే. ఆరోజు మొదలుకొని రాజు తన భార్యలనందరినీ వక్కమోస్తరుగా చూచుకొంటూ సుఖంగా వున్నాడు. కథ కంచెకు వెళ్ళింది, మనము ఇంటికి వచ్చాము."

"అమ్మయ్యా, నిద్దర వస్తున్నది, వెళ్ళి పడుకోవలె."

"పందెం గెలుచుకొన్నాను. నేనడిగింది యిచ్చి మరీ కదులు."

"ఎలా గెల్చా రేమిటి?"

"నీ వనుకొన్న కథా నే చెప్పింది!"

"కాకపోతే మాత్రం, నిజంకథా యేమిటి?"

"నిజం కథ కాదూ, పుస్తకాల్లో కథలలాగు లేదూ?"

"ఉంది లెండి. అయితే దీన్ని మీరు కల్పించారు. నే నోడినట్టు ఒప్పుకోను."

"ఒప్పుకోకపోతే సరా! నీ వనుకొన్న కథ కాదు, నే చెప్పింది. అంతే నాకు కావలిసింది."

"సరె, బాగానే వుంది! నే నియ్యనంటూ వుంటే మీ రెలా పుచ్చుకుంటారు?"

"అదో పెద్ద బ్రహ్మాండమా! ఇదుగో నీవు ఇవ్వనంటున్నా నేను పుచ్చుకొంటున్న దేమిటో చూశావా—ముద్దు!"

౧౯-౨౦

# మాఅబ్బాయి

౧

'అ అను అమ్మా, ఆ అను' అని మాఅబ్బాయిని చేతులలో ఇముడ్చుకొని, వాడు నోటిలో పెట్టుకొన్న మంటిబెడ్డను తీసివేయడానికి ప్రయత్నము చేస్తిని. నాయత్నము సాగనియ్యక, పిల్లవాడు ముఖము ఇటూ అటూ తిప్పుతున్నాడు. ఏలాగైతే నేమి, కష్టముమీాద మంటిబెడ్డ బైటికి లాగినాను. మళ్లీ నేను పడకకుర్చీలో కూర్చుండి సగము చదివిననవలను చేతపట్టినాను. ఆడుకోడానికి ముందు పెట్టినలక్క పిడతలు ఇటూ అటూ విసురుతూ, పాకిపోయి మళ్ళీ తెస్తూ, నాకొడుకు ఆడుకొంటూ ఉన్నాడు.

నవల చదవడానికి ప్రారంభించాను. కథాసందర్భము ఎంతో బాగాఉన్నది. నాయకుడు నాయికతో ఏమేమో తమాషామాటలు అంటున్నాడు. నాయిక ముఖము కిందికి వంచి సిగ్గు అభినయిస్తున్నది. ప్రేమ అంటే ఏమిటో, తాను ఏలాగున ఆమెను ప్రేమించినాడో, అమూల్యవస్తువులన్నింటిలోకీ తన ప్రేమ ఎంత అమూల్యమో నాయకుడు చెప్పుతున్నాడు. ఇంతలో ఒక

వీరుడు వచ్చి వారియెదుట నిలవబడినాడు. నాయికశరీ
రము వణికినది; నాయకుడు మాట్లాడ లేకపోయినాడు.
అంతట వీరుడు నాయికతో మృదుమధురవచనాలతో
ఈలా గన్నాడు......

ఈపట్టున వుండగా నాకొడుకు కెవ్వున కేక వేయ
డముచేత నాచేతిలో పుస్తకము జారవిడిచి, దిగ్గున లేచి
ఇటూ అటూ చూస్తిని. కుర్రవాడు నాగదిలో లేడు.
ఏమి జరిగిందో అని అడావడిగా నడవలోకి వెళ్ళినాను.
అక్కడ సుఖముగా పండుకొని నిద్రపోతున్న పెంపుడు
కుక్కతోకను పట్టుకొని గట్టిగా లాగుతున్నాడు.
కుక్కకు కోపము వచ్చింది. జంతువుకుమాత్రము కోప
ము రాదా? ఒకరిజోలికి పోకుండా మూల నిద్రపోతు
న్నాగదా, నన్ను బాధపెట్టడము మనుష్యస్వభావము
కాబోలు! వీళ్ళు నిద్రపోతూ ఉంటే వీళ్ళ కాళ్ళూ
చేతులూ పట్టుకొని ఎప్పుడైనా నేను లాగినానా? అను
కొన్నది కాబోలు కుక్క. తరవాత లేచి కుక్క కో
రలు చూపింది. 'ఇంతటి ఆయుధము నావద్ద వుంటే
నాదగ్గిరికి రావడానికి నీ వెలాగు సాహసించావు!' అని
కుక్కభాషలో అడగడము కాబోలది. కోరలు చూప
డమేకాక గుర్రు మన్నది కుక్క. కుర్రవాడు మళ్లీ
కెవ్వున కేకవేసి ఏడ్చినాడు. వాడిని ఎత్తుకొని గదిలోకి

వచ్చి తలుపువేసి, కింద కూర్చోబెట్టినాను. నాచదువుకు ఆటంకము కలుగకుండా ఉండేటందుకు వాడిచేతులలో బిస్కత్తు పెట్టి, ఆటవస్తువులు మళ్ళీ వాడిముందర పడవేసి నేను పడకకుర్చీ చేరినాను. మావాడు బిస్కత్తుకొరుకుతూ మిగిలిన ముక్క చేతితో పట్టుకొని గిర్రున తిరుగుతూ, చెయ్యిచాపి ఆడుతూ సంతోషిస్తూ ఉన్నాడు.

నేను నవల తెరిచి విడిచినపట్టునుంచి చదవడానికి ఆరంభించినాను. కొన్నిసంవత్సరాలకింద నాయిక ఈవీరునితో బాసచేసిందట. బాసచేసిన రీతికిన్నీ, ఈనాటి ఆమెప్రవర్తనకున్నూ ఉన్నవ్యత్యాసము అతను గ్రహించలేక పోయినాడు! అంతట నాయిక మాట్లాడ నారంభించినది. ఆమెకళ్ళవెంట బాష్పాలు రాలుతున్నవి. ఆయన యుద్ధాలకు వెళ్ళి పరాక్రమముతో పోట్లాడినట్లున్నూ, చివరకు వీరస్వర్గానికి వెళ్ళినట్లున్నూ విన్నదట. ఎవరో గిట్టనివాళ్ళు చెప్పి ఉంటారు. ఆసమాచారము వినకపోతే తన ప్రాణము ఉన్నంతవరకూ ఆయననే నమ్మి ఉండేదట. ఇంతలో నాయకుడు గొంతు సవరించుకొని నాయికకూ వీరునికీ మధ్య నిలబడి ఇలాగన్నాడు: "ఈవిషయములో ఎవరిప్రవర్తన చెడ్డదయినా దోషము నాదే. మొదటినుంచీ నాయిక-" ఈమా

టలు చదువుతూ ఉండేటప్పటికి నాబుద్ధి కథమీదికి వెళ్ళక, పరధ్యానములో పడ్డది. పేజీలు తిప్పుతూ చదువుతునే ఉన్నాను, కాని కథమాత్రం గ్రహించడము లేదు. ఈకాలపు నవలలనుగురించి ఆలోచన కలిగింది. నాయకుడు నాయిక ఎక్కడో తారసిల్లడము, పరస్పరము ప్రేమ, తరువాత వారికి కష్టాలు, విరహము, చివరకు పెళ్ళి— ఈవిధముగా పూర్తిఅయ్యే మననవలల సంగతి జ్ఞప్తికివచ్చి, ఏమేమో ఆలోచనలు కలుగుతుంటే హఠాత్తుగా చప్పుడు వినిపించింది. అంతట ఏమి టా చప్పు డని వెనకకు తిరిగి చూస్తిని. మావాడు గోడ దగ్గరపెట్టెమీది కెక్కి, గోడకు తగిలించిన అల్మారులో నుంచి పుస్తకాలు కిందికి లాగి పడవేసినాడు. దాని చప్పుడు.

ఇంతలోనే వాడు సిరాబుడ్డి తీసి తలకిందుగా పట్టుకొని తనమీదా, పుస్తకాలమీదా, పెట్టెమీదా సిరా పారబోసినాడు. ఖరీదు గలపుస్తకాలు ధ్వంసముచేస్తున్నాడని—ఇదివరకు కొన్నిచించివేసినాడు—పట్టరానంత కోపము వచ్చి గూబ కదలవేయడానికి కుర్చీలోనుంచి లేచేటప్పటికి చేతిలో ఉన్నసిరాబుడ్డి నామీదికి విసిరి, 'నాన్నన్న, నాన్నన్న' అన్నాడు. నాబట్టలనిండా సిరాచుక్కలు పడ్డవి. 'ఎంతఅల్లరి చేస్తున్నావు! రావ

కా అల్లరి! 'అన్నా!' అని నే నంటే కుర్రవాడు నా వైపు తిరిగి 'అన్నా!' అన్నాడు. నా కోపము ఎగిరిపోయింది. సిరా అంటిన వాడిబుగ్గ ముద్దుపెట్టుకొన్నాను. ముద్దుపెట్టుకొంటుంటే వాడు సిరాచేతులు నాముఖాన పూసినాడు. ముఖము పైకెత్తి గుమ్మముకేసి చూతును గదా అసిస్టెంటు పోలీసు సూపరింటెండెంటుగారు అక్కడ నిలుచునివున్నారు!

౨

నేను ఉద్యోగములో ప్రవేశించింది మొదలు నేటి వరకూ అధికారులమెప్పుదల పొందుతూ ఉన్నాను. ఎందరో అధికారులు వచ్చినారు, వెళ్లినారు. అందరూ నన్ను ప్రీతితో చూచేవారు. కిట్టనివాళ్ళు నన్నుగురించి అనేకవిధాలుగా చెప్పుకొంటారు. ఎవ్వరేమి అనుకొన్నా నాకేమీ లోటు లేదు. వంగి వంగి సలాములు చేస్తూ నేను అధికారులవెంట తిరుగుతానట. పెద్దమనుషులను మర్యాదచేయడము వంగి వంగి సలాములు చెయ్యడమూ? నే నేమో బిరుదులు ఆశిస్తూ, ఉన్నడబ్బంతా అధికారులకోసము ఖర్చుపెట్టుతూ, స్వాతంత్ర్యము లేనివాడ నని బంధువులూ, స్నేహి

తులూ చెప్పిపోడవడము న్యాయము కాదు. నిజము ఎదుటివారికి తెలియదు.

ఏ మయినా సరే అని కొత్తగా వచ్చిన పోలీసు దొరను కాఫీ పుచ్చుకొనడానికి మాయింటికి ఆహ్వానము చేశాను. తెల్లవాళ్ళు మాయింటికి స్నేహభావముతో రావడము చూసి నాబ్రాహ్మణ్యము పాడయిపోయినదని చుట్టుపక్కలవాళ్ళు అనుకొనేవాళ్ళు. అయితే నేను వాళ్ళను లక్ష్యము చేసేవాడను కాను.

ఎనిమిదిగంటలకు ఆయన వస్తాడని నేను కనిపెట్టుకొని వుండి, ఊరికే కూర్చోకుండా నవల చదువుతూ ఉంటిని. మావాళ్ళు లోపల కాఫీ కాస్తూఉంటే కుర్రవాడు తల్లిదగ్గర ఉండక నాదగ్గిరికి వచ్చినాడు. పోనీ అని ఊరుకొన్నాను. పుట్టక పుట్టక పుట్టిన పిల్లవాడు కావడముచేత తల్లీ నేనూ వాణ్ణి ఎంతో గారాబంగా చూస్తూ ఉంటాము. వాడు చేసేఅల్లరికి మితి లేదు. చెప్పగూడదు గాని వాడిఅల్లరిమూలానే నాకూ వాడి తల్లికీ రెండుమూడుసార్లు జగడము సంభవించింది. జగడము లేనియిల్లు వున్నదా? ఈక్షణము భార్యతో దెబ్బలాడి పరక్షణము మళ్ళీ మాట్లాడనివా రెవరు? కాని నేనుమాత్రము దెబ్బలాడిన తరువాత రెండుమూడు రోజులదాకా మాట్లాడేవాడను కాను.

ఒకనాడు నేను పుస్తకము చదువుతూ ఉంటే మా వాడు గదిలోకి వచ్చినాడు. నేను చదివేవేళా, వాడు అల్లరిచేసేవేళా సామాన్యముగా ఒకటే. నేను చదువుతూఉంటే వాడు దగ్గిరికి వచ్చి చదువున పుస్తకము లాగితే కొన్ని కాకితాలు చినిగినవి. నాకు చాలాకోపము వచ్చినది. అటుమీద వాడిని తల్లిదగ్గిరికి ఈడ్చుకు పోయినాను. తల్లికూడా వాణ్ణి రెండు తిట్టింది. మళ్ళీ గదిలోకి వెళ్ళినతరువాత నాకు పశ్చాత్తాపము కలిగింది. ఇంతలో కుర్రవాడు గదిలోకి వచ్చి నాచెయ్యి పట్టుకొని ఇంట్లోకి లాగుకొని పోయినాడు. ఎందుకో అనుకొన్నాను. వాడు తనతల్లిచెయ్యి రెండోచేత్తో పట్టుకొని మాయిద్దరిచేతులూ కలిపినాడు. మూడేళ్లపిల్లవాడు ఇటువంటిపని చేయడము ఇతరులకు నమ్మశక్యము కాని దైనా, వింతగా కనపించినా, మాకుమాత్రము సంతోషము కలిగించింది. కలహాలు కల్పించడానికి చేతులు కలపడానికీ తగినవాడ వయినావా అనుకొని ఇద్దరమూ వాణ్ణి చూసి నవ్వినాము.

దొరకోసము ఎదురు చూస్తూ, నవల చదువుకొంటూ ఉంటిని. మావాడు అల్లరిచెయ్యడమూ, నేను సద్దడమూ వీటితో కొంత కాలక్షేపము అయింది. ఇంతలో దొర వచ్చి, గుమ్మముదగ్గర నిలవబడినాడు. నాబట్టల

నిండా సిరా, ముఖమునిండా సిరా, చేతిలో పిల్లవాడు! ఇటువంటి వికారపు వేషములో ఆయనకు కనబడ్డాను గదా అని చిన్నపోయినాను. అందులో అపేక్షసునిషి మనవాడైనా కాదు, తెల్లదొర!

దొర గుమ్మము దగ్గిర నిలుచుని చిరునవ్వు నవ్వి నాడు. ఇం కేమున్నది! నా మోటతనము చూచి ఆయన నవ్వినా డనుకొన్నాను. మనఃపూర్వకంగా క్షమాపణ చెప్పుదా మనుకొన్నాను. నోరు తెరవబో య్యేటప్పటికి 'మీపిల్లవాడా?' అని దొర అన్నాడు. 'కాదు!' అని చెప్పదలచుకొన్నాను. నాకొడుకు ఇలాటి అవకతవక పనులు చేస్తాడని అనుకొని పోతాడని కాదు అనబోతిని. నాలికచివరకుకూడా వచ్చింది. అయితే ఇతరులపిల్లవాడు నాంగదిలో ఇంతల్లరి చేయడానికి నేను సహిస్తానా! అంశమాత్రం దొర గ్రహించలేడా అని ఆలోచించి, ముందు క్షమాపణ చెప్పి, నాపిల్లవాడే అనక తీరింది కాదు. ఎంతో నొచ్చుకొని, మిక్కిలి దీనముగా జవాబు చెప్పినాను. దొర మళ్ళీ నవ్వి 'అల్లరి పిల్లవాడు లాగు వున్నాడే!' అన్నాడు. ఇం కేమున్నది! అన్నం దాలా బిడియమే అనుకొని, ఆయన కేమి జవాబిత్తునా అని ఆలోచించినాను. అల్లరి పిల్లవాడే అంటే హిందువులు పశువులనుకొంటాడేమో, నన్నేమనుకొంటాడో.

గా డంటే అల్లరి చేసినట్లు కనిపిస్తున్నదే! 'చిత్తము, క్షమించండి. అల్లరి పిల్లవాడే' అంటిని. అన్నప్పుడు నీతిచంద్రికలోమాట జ్ఞాపకము వచ్చింది. 'గంపెడు గులకరాళ్లకంటె ఒక్కమాణిక్యము చాలు'నని. ఇస్తూ ఇస్తూ భగవంతుడు ఈగులకరాయే నా కియ్యవలెనా? అనుకొన్నాను. దొర వినుకొని మొగము చిట్లించుకొని వెళ్ళిపోతాడేమో అని భయము వేసింది. కాని ఆయన నెమ్మదిగా నాకొడుకు దగ్గరికి వచ్చి, వేలితో వాడిబుగ్గమీద నవ్వుతూ కొట్టినాడు. ఆమాత్రము చనువు ఇచ్చిందే చాలు నని కాబోలు మావాడు దొర మెడలోపట్టీ (టై) పట్టుకొని గట్టిగా లాగివేసినాడు. నేను చాలా సిగ్గుపడ్డాను. దొరకు కోపము రాలేదు. పైగా ఆయన కుర్రవాడిని ముద్దాడినాడు. ఈయనకు మతి పోయిందా అనుకొన్నాను. తర్వాత ఆయన మావాడిచేతిలో పదిరూపాయలనోటు పెట్టి, కుర్చీలో కూచుని, 'చక్కని కొడుకు! అదృష్టవంతులు మీరు!' అన్నాడు. సమయము దొరికిందే చాలునని మావాడి గుణాలన్నీ ఆయనయెదుట ఏకరువు పెట్టినాను. చుట్టుపక్కల ఉన్నపిల్లవాళ్లకంటె మావాడు చక్కనివాడు, బుద్ధిమంతుడు—ఏమి కాదు! అన్నీ గబగబా చెప్పినాను. దొర నామాటలకు నవ్వినాడు.

"నాకూ ముగ్గురు పిల్లలున్నారు. వాళ్లూ ఇలాగే అల్లరి చేస్తారు" అని దొర అన్నాడు. ఏమిటి! దొరల పిల్లలుకూడా అల్లరి చేస్తారా! అల్లరి చేయడము అనాగరికుల లక్షణముకాదా?

"చురుకుగా అల్లరిచేసేపిల్లలను చూస్తే నాకిష్టము" అన్నాడు దొర. మా అబ్బాయి మరింత అల్లరి చేస్తే బాగుండును అనుకొంటిని. దొరకు కాఫీవేళ దాటిపోతున్నదని నేను ముగమూ చేతులూ కడుగుకొని మంచి బట్టలు వేసుకొని రావడానికి ఆయనను సెలవు అడిగితే వద్దని ఆయన నన్ను కూర్చోబెట్టి తనబిడ్డలసంగతి చెప్ప నారంభించినాడు. మావాడు ఊరుకోక దొర వొళ్లో కూర్చున్నాడు. చాలాసేపు ఇష్టాగోష్ఠి జరిగింది. కాఫీ తాగి దొర వెళ్ళబోతూ ఉంటే, ఆయనదుస్తులకు మావాడు సిరాచేతులు రాచినందుకు క్షమాపణ చెప్పబోతిని.

"ఫరవాలేదు! కుర్రవాడి చేతినుంచి సిరా నాకోటుమీదికి వచ్చినందుకు గర్వపడుతున్నాను!" అని దొర వెళ్ళిపోయినాడు.

ఇంటిలోకి వెళ్ళి నేను ఈసంగతులు మావాడితల్లితో చెప్పినాను. ఇద్దరమూ ఇంతసేపు నవ్వుకొన్నాము.

# వరూధిని

ప్రదేశము.—హిమాలయపర్వతశిఖరము. చుట్టుపట్ల పుష్పించిన చెట్లూ, చెట్లమీద కిలకిలలాడే పక్షులూ వున్నవి. వృక్షాగ్రముల మీద తెల్లగా ముద్ద కట్టివున్న మంచు బొట్లు బొట్లుగా కారుతూ వున్నది. భూమి పర్వతమయ మైనప్పటికీ మంచు రాలి తెల్లగా మెత్తగా వున్నది. అప్పుడప్పుడు జింకలమంద ఆప్రాంతాలకు వచ్చి గంతులు వేయబోతూ మంచువల్ల గంతలేక నెమ్మదిగా నడిచి పోతున్నది. కనుచూపుమేరలో హిమసౌధ మొకటి కనబడుతూ వున్నది. అవైపు నుంచి చల్లనిగాలి వీస్తూ నలుగడలా సువాసనలు చిమ్ముతున్నది. చేతులనిండా పువ్వులూ పళ్ళూ పట్టుకొని ప్రవరుడు ప్రవేశిస్తున్నాడు. వయస్సు ముప్ఫైసంవత్సరములు. ఆరుఅడుగుల ఎత్తు వున్నాడు. దేహము పసుపురంగు. మీసము లేదు. నీరుకావి బట్ట, బిళ్ళగోచి, కుచ్చెళ్ళుపోసి కట్టుకున్నాడు. పైన నీరుకావి వుత్తరీయము కప్పుకున్నాడు. చెవులకు బంగారుకుండలా లున్నవి. చేతిలో పళ్ళూ పువ్వులతోపాటు రాగిఘూరీచెంబూ వున్నది. బుజముమీద గావంచా వున్నది. మిట్టమధ్యాహ్నము. కింద మంచు కాళ్ళకు జివ్వు మని తగలడముచేతా పైన మధ్యాహ్నసూర్యుని కిరణముల ధగధగచేతా అతను అలసి విసికినట్లు మొగము చెప్పుతోంది. మొగముమీదా ఒంటిమీదా చెరిగి పోతున్న విభూతిపిండెకట్లు కలవు. అతను హిమసౌధమువేపు కొంచెము నడిచి కూచుని వుత్తరీయములో పళ్ళూ పువ్వులూ మూటగట్టి బుజాన వేసినాడు. గావం

చాను ఝూరీచెంబు కట్టి రెండవభుజముమీద వేసి లేచి, చేతులు పైకెత్తి, ఆకాశమువేపు చూస్తూ]

ప్రవరుడు

జయ సీతారాం! [అని ఎగిరినాడు తాను అనుకొన్నట్టు ఆకాశముమీదకు పోక మంచులో పడ్డాడు మళ్ళీ]

ప్రవరుడు

జయ సీతారాం! [యథాప్రకారము మంచులో పడ్డాడు]

ప్రవరుడు

సిద్ధుకు మోసం చేశాడా ఏమిటి చెప్మా! అవును, వచ్చిన గోసాయీవాడినల్లా నమ్మితే ఏమవుతుంది? మోసమే అయితే మొదటినుంచీ మోసంకాని తీరా యిక్కడకు వచ్చాక మోసం ఏమిటి? అయినా కాలికి పసరు వున్నంతకాలం స్వేచ్ఛాగమనం చెయ్యవచ్చునని సిద్ధుడు చెప్పినాడుగా. [అని పాదములు శోధించి చూసుకొని]

ఇంకే ముంది! పుట్టి మునిగింది! ఈ మంచుకొండ విడిచి ఇంటికి వెళ్ళేసాధనం ఏమిటి?

[దిగాలుపడి మంచులో కూర్చున్నాడు. మంచుసౌధములోనుంచి దివ్యస్త్రీ బయటకు వస్తుంది. ఆమే పేరు వరూధిని, వయస్సు పదహారేళ్ళు వుండవచ్చును. అయిదడుగుల ఆరంగుళముల పొడుగు. శరీరచ్ఛాయ మంచుతో జాఫరారంగు మిళితము చేసిన ట్లుంది. ఏవిధమైన వస్త్రమున్నా ఆమె ధరించలేదు. పొగమంచు ఆమెశరీ

రాన్ని వస్త్రమువలె కప్పింది. ఆమెచేతిలో చితారు వున్నది. తంత్రులు తమంతట తామే పలుకుతున్నవి. ఆమె వెన్నంటి ఒక జింక పిల్ల వస్తోంది. ఆమెను చూచి పక్షులామె మెడమీదా తలమీదా వాలుతున్నవి. వాటి నామె తరిమి వేసింది. బయటకువచ్చి]

వరూధిని

ఎవరో మేఘగంభీరస్వరముతో సీతారాముల పేరు ఎత్తినారు?

[నలువంకలా పరీక్షించి చూచి ప్రవరుడున్నచోటు గుర్తించి ఆశ్చర్య సంభ్రమాలతో అతన్ని సమీపించి]

ప్రేమమూర్తీ, నీ వెవరు?

ప్రవరుడు

[ఆశతో మొగమెత్తి ఆమెను చూచి, తటాలున మొగము వంచుకున్నాడు. మాటాడలేడు.]

వరూధిని

సౌందర్యరాశీ, నీవు కంతుడవా ?

ప్రవరుడు

[మొగము చిట్లించుకొని మాటాడలేడు.]

వరూధిని

వాక్కులేని ఈ అందపుముద్ద ఎక్కడనుంచి వచ్చి పడిందో!

ప్రవరుడు

[చెట్టునుంచి అప్పుడే రాలిపడిన పువ్వును చేతితో పట్టుకొని దాన్ని వేళ్ళతో తిప్పుతూ] అమ్మా! నా యింటికి తెరువు చూపవా! ఆర్యావర్తము పోవలె నేను.

వరూధిని

[జింకపిల్ల ప్రవరుని సమీపించి అరచేతులో పువ్వు నాలుకతో అందుకొంటుండగా దాన్ని ఇవతలకు లాగివేసి] మొగమెత్తి మాటాడరావా, మోహనాకారా!

ప్రవరుడు

నగ్నస్త్రీని ఎట్లు చూడగల నమ్మా?

వరూధిని

ఇప్పుడేగదా నా జింకపిల్లను చూశావు!

ప్రవరుడు

అది జంతువు.

వరూధిని

ఓహో! నేను నాకళ్ళతో నీ సౌందర్యాన్ని ఆస్వాదించడం లేదా!

ప్రవరుడు

నాశరీరం ఆచ్ఛాదితమే.

వరూథిని

నీసౌందర్యం అనాచ్ఛాదితము. ఎక్కడ శాసనా లివి నాముందు ఏకరువు పెట్టుతున్నావు నా రాజా?

ప్రవరుడు-

ధర్మశాస్త్రవిరుద్ధమైన కార్యాలను నేనా— ఈహిమవత్పర్వతముమీద నా— ఎలా చేయగలను? నాకు ఇంక పుట్టగతు లుంటవా?

వరూథిని

మానవశాసనాలసంగతా మాట్లాడుతున్నావు? ఇట్టి విపరీత శాసనాలు, నవ్వు పుట్టించేశాసనాలు మానవలోకంలో కలవట! నారదుడు చెప్పగా విన్నాను. ఓహోహో! [అని పకపకా నవ్వుతున్నది. ఎర్రని పెదవులు విడినవి. ముంముని తెల్లగా తీర్చి దిద్దిన ట్లున్నదంతాలు కనబడుతున్నవి. నేత్రములనుంచీ నవ్వు వస్తున్నది.]

ప్రవరుడు

శరీరాచ్ఛాదనము మానవశాసనమా?

వరూథిని

కాదా మరి? అయ్యో, నీవిషయమై నే నెంత అపచారము చేస్తున్నాను! నీతో వాదన పెట్టుకొందునా, మనోహరమూర్తీ!

ప్రవరుడు

పితృపూజకూ దేవతార్చనకూ వేళయింది. నాకు తెరువు చూపవా తల్లీ!

వరూధిని

ఓహో! ఎంత అదృష్టం. మానవులసంగతి వినడమేకాని కనడంలేదు. మానవు లంతా యీలాగ వుంటే నా కింక దివ్యలోకం ఎందుకు? ఓమానవుడా! నాహిమధామానికి రావా? అక్కడ నీ కన్నీ చెప్తాను.

ప్రవరుడు

నిన్నొకన్నెత్తిచూస్తూ నీహిమధామానికి నేనెట్లా రాగలను?

వరూధిని

నీసందేహాలు హాస్యాస్పదంగా వున్నవి!

[పిరుదులను దాటి వేలాడుతున్న శిరోజాలను ఆమె ముందు భాగానికి దీసి వక్షముమీదినుంచి తొడలవరకూ వ్యాపించి ఆయా భాగాలను సగము సగము కప్పేటట్లు చేసింది. శిరోజాల సందు నుంచి ఆమె శరీరచ్ఛాయ ధూమపంక్తులమరుగునుంచి వెలువడే అగ్నిజ్వాలకాంతులవలె వున్నది.]

ప్రవరుడు

నాయింటికి మార్గం చూపిస్తే యిక్కడనుంచే వెళ్ళిపోతాను.

[అంటూ లేచి ఆమెకు ఎదురుగా నిలబడి హిమసౌధంవేపు చూస్తున్నాడు.]

వరూధిని

నాకు నీ వతిథివి. సావకాశంగా కూర్చుని మాట్లాడి నీ కతిథిసత్కారం చేసినపిమ్మట గాని నిన్ను వెళ్ళనివ్వను.

[అని కిలకిల నవ్వుతూ అతని చెయ్యి పట్టుకో బోయింది. అతడు తప్పించుకొని హిమసౌధము వేపు తల వంచుకుని నడవడం మొదలుపెట్టినాడు. వరూధిని సంతోషం పట్టలేక జింకపిల్లను ఎత్తుకొని అతనివెంట మందగమనంతో కొంతదూరం పోయింది. వీస్తూన్న గాలివల్ల ఆమె శిరోజములు కొన్ని మళ్ళీ వెనక్కుపోయినవి. ఒక కోకిల ఆమె బుజముమీద వాలి కుహు అని కూజితము చేసి ఎగిరిపోయినది. ఆమె అతనికి ముందుగా పరుగెత్తి హిమధామాన్ని చేరింది.]

రా, నాయింద్రా, రా, ఈపుష్పశయ్య నధిష్ఠించు.

[హిమధామములో నవరత్నాలు పొదుగుటచేతనైన వివిధపుష్పములు గోడలమీద కలవు. గదికిమధ్య పుష్పశయ్య వజ్రపీఠిమీద అమర్చబడివున్నది. శయ్యకిరుపక్కలా పచ్చలచిలుకలు కలవు. పుష్పశయ్యకు పైన రత్నములగుత్తులు పూగుత్తులవలె వేలాడుతున్నవి. వాటికాంతులు సౌధమంతా పలురంగులతో నింపినవి. పుష్పశయ్య కెదురుగాను పక్కలను మణిపీఠాలు కలవు. వాటిమీద పత్రశయ్య లున్నవి. గోడమట్టూ చంద్రకాంత శిలావేదికలు

కలవు. వాటిమీద వుంచినమణిపాత్రలలో మిలమిలలాడే ద్రవము కలదు. ఇంపైన నునువెచ్చనిగాలి సౌరభభరితమై వీస్తున్నది. మణిపీఠముపైన వీణ కలదు. జింకపిల్లను కిందకు దింపి, చేతిలో చితారు మణిపీఠముపైన వుంచి చితారు నుద్దేశించి]

నీ వింక పలకకు. నీపాటలను ఈనాచిత్తచోరుని పలుకులు సిగ్గుపరచడం లేదా? నీ వెందు కింకా పాడుతావు?

[చితారు పలకదు. పుష్పశయ్యమీద మూట దింపి ప్రవరుడు మఠము వేసుకొని కూర్చుండును. అతనికెదురుగా పాదములు వెనుకవైపునకు పెట్టి ఒకపీఠము మణిపీఠముపైన అని వరూధిని కూర్చున్నది. శిరోజములతో మల్లెపత్తోదేశమును కప్పుకొన్నది]

ప్రవరుడు

ఈమాటేనా నాయింటికి దారి చూపించవా?

వరూధిని

[అతనిమూట చేతితో పట్టుకొని విప్పుతూ నవ్వుకొంటూ]

మీబట్టలివా! అబ్బా! ఎంత మోటుగా వున్నవి! చితారుతీగె లల్లినట్లు ఎంత దట్టముగా వున్నవి! ఔరా, ఔరా, యివేమిటి?

ప్రవరుడు

[కొంచెము తల యెత్తి] పళ్ళు.

వరూధిని

ఎక్కడ సంపాదించావు వీటిని?

ప్రవరుడు

ఈ కొండశిఖరం మీదనే.

వరూథిని

ఎందుకూ?

ప్రవరుడు

తినడానికి.

వరూథిని

ఎవరు?

ప్రవరుడు

మేము.

వరూథిని

పక్షులూ జంతువులూ తినేవి నీవు తింటావా నా మణికిరీటమా?

ప్రవరుడు

నీ వేమి తింటావు?

వరూథిని

అమృతము.

ప్రవరుడు

దేవతా స్త్రీసందర్శనము ఎంతపుణ్యము! ఈమెకు మొక్కుకొందునా?

వరూధిని

ఏమిటి, నోట్లో గొణుగుకొంటున్నావు! గట్టిగా మాట్లాడు నారాజా, గట్టిగా మాట్లాడు! నీమాటలు నాహృదయాన్ని పూరిస్తున్నవి. మాట్లాడ వేమి నా స్వామీ? నీమాటలు అమృతాన్నీ దివ్యవీణనూ మర పునకు తెస్తూవున్నవి.

ప్రవరుడు

మీకు మరుపు వున్నదా?

వరూధిని

ముఖ్యాంశముల వెనక అముఖ్యాంశములు ఒదగడమే మామురవు. అవును గాని యిది వేమిటి?

ప్రవరుడు

పువ్వులు.

వరూధిని

[ఒక్క-పువ్వును తీసి స్తనసీమమీద వాలిన కురులలో పెట్టుకొంటున్నది.]

ప్రవరుడు

ఆఁ, ఆఁ, వద్దు, వద్దు!

వరూధిని

ఏమిటి, నారాజా, ఏమిటి?

ప్రవరుడు

దేవపూజ కేర్పాటైన ఆపుష్పాను నీవు ధరించ రాదు!

వరూధిని

నీయిష్టము వచ్చినట్లే చేస్తాను, ప్రేమమూర్తీ! ఈ పుష్పాలు పూజకేనా, తింటానికూడానా!

ప్రవరుడు

తినరు, పూజకే.

వరూధిని

[గట్టిగా పకపక నవ్వుతూ]

పక్షులుతినేపళ్లు తింటారు! తుమ్మెద లాస్వాదించే పుష్పాలు పూజ చేస్తారు! చిత్రం! ఈమానవులచర్య లన్నీ వింతలే! పోనీగాని, నాయింద్రా నాచిత్తచో రా, మొగముమీదా నంటిమీదా ధూళి పడ్డదేమి?

ప్రవరుడు

ధూళి కాదు, విభూతి.

వరూధిని

ఓహో, శివరూపం ధరిస్తున్నావా, నారాజా! నా శిరోజములతో ఈభూతి తుడిచి పుష్పాడి గంధం నీవం టికి రాతునా?

[అని ముందుకు వాలినది. శిరోజములను చేతితో పట్టుకొని పైకెత్తినపుడు అతను ఆమె వైపు తిరుగగా అతనిదృష్టులు ఆమెవక్షస్సీమపైన పడినవి. తటాలున కళ్ళు మూసుకొని వెనుకకు జరిగి]

ప్రవరుడు

పుండరీకాక్షా! పుండరీకాక్షా! నన్ను ముట్టుకోకు, దూరంగా వెళ్లు, వెళ్లు!

వరూధిని

అయ్యో, అయ్యో! నీకు కోపం తెప్పించ లేదుకదా నాస్వామి! పోనిలే, యింకోమాట చెప్పూతా విను.

ప్రవరుడు.

దూరంగా వుండి చెప్పు.

వరూధిని

వాడిపోయే ఈపుష్పాలూ కుళ్ళిపోయే ఈపళ్ళూ నీకెందుకు? అవతల పారవేస్తావా? వానిబదులు నీకు వాడులేనిపుష్పములు సమర్పింతూనా? తేనెతేటలూరే కమియుపండిన ఫలాలు అర్పింతునా?

ప్రవరుడు

నాకేమీ అక్కర లేదు. నే నింటికి పోవలె. నాకు మార్గము చెప్పవా?

వరూధిని

తామరదొన్నెలో పోసి తేటు లాననిపద్మమధువు తెమ్మంటావా, నారాజా?

ప్రవరుడు

వద్దు, వద్దు.

వరూధిని

నాగాయక సేవకు లైన యీాపత్తు లన్నింటిచేతా సభ చేయించి నీ సౌందర్యగీతాలు పాడిద్దునా?

ప్రవరుడు

వద్దు, నే వెడతా.

వరూధిని

పోనీ, నేను నిన్ను గురించి ప్రేమగీతాలు ఆలాపిస్తాను వింటావా, నాకన్నా?

ప్రవరుడు

వద్దు, వద్దు.

వరూధిని

పోనీ! నామణిసౌధపుశోభలు చూడ్దువు గాని లే, చూపిస్తా.

ప్రవరుడు

వద్దు.

వరూధిని

నేను చెప్పడానికిముందే వద్దంటావు. ఊకొట్టనైనా ఊకొట్టకూడదూ?

ప్రవరుడు

ఊఁ!

వరూధిని

ఆకాశగర్భాన మందాకినీనది పారుతున్నది. దాని గట్టుమీద చక్కని పొదరిండ్లు ఉన్నవి. ఏం?

ప్రవరుడు

ఊఁ.

వరూధిని

వియద్గంగా వీచికలపైన ఊగులాడే హంసదంపతుల ప్రియభాషణలు ఆపొదరిండ్లలో కూచుని విందాము, వస్తావా?

ప్రవరుడు

రాను.

వరూధిని

పోనీ, కల్పవృక్షచ్ఛాయలో రచ్చశిలమీద కూర్చుదాము, ఏం?

ప్రవరుడు

ఊఁ.

వరూధిని

అక్కడ చిలకలచేత పాటలు పాడిద్దాము. ఆపాటలకు సరిపోయేటట్లు నెమిళ్ళచేత నృత్యము చేయిద్దాము.

ఆఆటకూ పాటకూ సరిపోయేటట్లు మనం తాళము వేద్దాము. రావా?

ప్రవరుడు

రాను.

వరూథిని

పోనీ, నందనవనములో పారిజాతవృక్షముకింద చంద్రకాంతోపల వేదికమీఁద పుష్పపర్యంకాలు పరచి వుంటవి.

ప్రవరుడు

ఊఁ.

వరూథిని

వాటిపైన మనము పండుకొని రాధాకృష్ణగాథావళి చెప్పుకొందాము. ఈమాఱైన రావా?

ప్రవరుడు

రాను, రాను.

వరూథిని

పోనీ, ఈపర్వతాన మంచుకెరళ్ళపైన నడిచి నడిచి కైలాసశిఖరం చేరుదాము.

ప్రవరుడు

ఊఁ.

వరూధిని

చేరి ఆప కాంతసీమలో ఉమాశంకరుల లీలోద్యాన విహారాలు విలోకింతామా?

ప్రవరుడు

ఊఁ హూఁ.

వరూధిని

పోనీ, మన మిద్దరమూ చెరివక మేఘముపైనా కూచుని ఆ మేఘాలను ఆకాశపథాన పంతెము వదులుదాము, ఈమాటైనా రానా!

ప్రవరుడు

రాను.

వరూధిని

చదలేటి తరంగాలపైన ఉయ్యాలలూగే బంగారు పద్మపీఠాలమీద మన మిద్దరమూ కూర్చుండి తేటి పాటలలోని వలపుతేటలను ఆస్వాదిద్దాము—ఈమారు.

ప్రవరుడు

రాను.

వరూధిని

తెల్లని రాయంచ విప్పిన వెడద రెక్కలు రెంటిపైనా మన మిద్దరమూ కూచుండి చెట్టాపట్టాలు వేసుకొని ఒక్కమారు ఆకాశపథానికి ఎగురుదాము.

ప్రవరుడు

ఊఁ.

వరూథిని

ఎగిరి మానససరోవరానికి పోయి జలక్రీడలు ఆడు కొందాము నారాజా!

ప్రవరుడు

రాను.

వరూథిని

ఈకొండమీది వివిధరత్నములూ రాసులు పోయించి, వానిపైన సూర్యకిరణాలు ప్రసరిస్తుండగా పుట్టిన వేర్వేరు వర్ణాలతో ఈమణి సౌధానికి రంగులు వేయించి ముగ్గులు పెట్టిస్తా, చూస్తావా!

ప్రవరుడు

చూడను. నా కేమీ అక్కర్లేదు. అబ్బా! నువ్వు కొంచెం చాటుగా కూచుందూ. నాకు మతి పోతున్నది!

వరూథిని

అయ్యో, అయ్యో, నాప్రాణమా! నీకు నే నేమి అపచారం చేస్తున్నాను? ఇక్కడ కూచుందునా!

[వరూథిని లేచి అలవాటుచొప్పున కుంతలాలను వెనక్కు తోసినది. వక్షము అనాచ్ఛాదిత మయింది. ప్రవరునిపక్క వున్నమణి

ఫలకముమీద కూచుని పాదాలు వెనకకు చాపి ముందుకు వంగి మోచేతులను పువ్వులమీద మోపి కరతలములమీద మొగ మానించి అతనికేసి తేరిపారచూస్తూవున్నది. కురులు రెండుభుజములమీది నుంచీ కిందకు జారినవి.]

నాప్రాణమా! యిట్లా చూడు. నీకనుల వెలుగులు నన్ను తాగనివ్వవా! అయ్యో ఆనలునమీాకు రెప్పపా టెందుకు పెట్టినాడు! చూడు నాకొండా, నా కేసిచూడు, నాలాంటి దేవతాస్త్రీని నీ వెప్పుడైనా చూశావా!

ప్రవరుడు

[ఆమెపై పుచూచి] నీకుంతలములే నీకు వస్త్రములకింద ఏర్పాటుకాబడినట్లు తోస్తుంది. వాటిపని వాటిని చెయ్యనియ్యి.

వరూధిని

[కురులు బుజముమీదినుంచి ముందుకు దిగజారేటట్లు చేసి] అమృతాంగా! నీ వెక్కడనుంచి నాకు ప్రసాదింపబడితివో చెప్పవా!

ప్రవరుడు

ఎంతనుంచి ఎంతకు వచ్చింది! పుణ్యభూమిదర్శనము చేసుకోరాగా పాపబుద్ధులు పుట్టడానికి మార్గము తటస్థమైంది!

వరూధిని

నరలోకపుసంగతులు స్మరించడము మానివెయ్యి వా, నాస్వామీ! ఇందుకళావతంసుని పావనపాదధూళిచేత పవిత్రీభూతమైన యీసీమలోనా పుణ్యపాపాల మాట తలపెట్టుతున్నావు!

ప్రవరుడు

నీ వేమోమో అప్రస్తుతప్రశంస చేస్తున్నావు. నన్ను దరిజేర్చగలశక్తి వుంటే చేర్చు. లేకపోతే నాదారిని నే పోతా.

వరూధిని

అమ్మో! స్వామి కిక కోపం వచ్చింది! అడుగు, నాకన్నా, అడుగు. నీ వడిగిన ప్రశ్నలకు నేను సమాధానం చెప్తా. [సంభ్రమంగా లేచి మోకాళ్ళనూ పాదములనూ నేలపైన మోపి ముందుకు వంగి ప్రవరుడిమొగము చూస్తున్నది.]

ప్రవరుడు

మాయింటికి తెరువు.

వరూధిని

[జింకపిల్ల ప్రవరుని సమీపించి అతనిపుండలములను నాలుకతో అందుకుంటున్నది. వరూధిని దానిని దగ్గరకు దీసి ఎత్తును దాని పైన మోపి తలదువ్వుతూ]

జింకపిల్లా, మాట్లాడేటప్పుడు అడ్డం రావచ్చునా?

ప్రవరుడు

[మొగ మెత్తి వరూధినిని తేరిపార జూచినాడు. వరూధిని ఆతన్ని ఓరగా చూసి చిరునవ్వు నవ్వింది. ప్రవరుడు సగము నవ్వి ఆపుకొని] నామీద నువ్వు మత్తుమందు చల్లలేదుకదా?

వరూధిని

అ దేమిటి?

ప్రవరుడు

ఏమీ లేదు. వేళ మీరిపోతోంది. ఇంటికి పోవాలి, తోవ చెప్తావా, చెప్పవా?

వరూధిని

ఎటువేపు నీయిల్లు నాస్వామీ?

ప్రవరుడు

వరుణానదీ శీకరములచేత ఎల్లవేళలా తడిసే అరుణాస్పదము.

వరూధిని

ఓహో, మాఅక్కగారూ ఆమెకోడలూ తరుచు విహరించే దేశమా?

ప్రవరుడు

మీ అక్కగా రెవరు?

వరూధిని

ఎరగవా, నాసొగసులకుప్పా! శ్రీమహాలక్ష్మి నాతో బుట్టువేగా.

ప్రవరుడు

జగదంబసోదరి వైన నిన్ను కన్నెత్తి చూడడానికి నా కేల సందేహము కలుగుతోంది?

వరూధిని

సందేహమా? సందేహ మెందుకూ? కళ్ళు మూయకుండా నా కేసి చూసిచూసి నాసౌందర్యాన్ని తాగరాదా ముద్దులమూటా! తోడి దేవతలకుసైతము దుర్లభ మైన యీనాలావణ్యజలముతో నీకు నా హృదయాన్ని ధారపోస్తున్నా నంటే చెయ్యి పట్ట వేమి, వెర్రిరాజా?

ప్రవరుడు

ధర్మవిరుద్ధకార్యాలు స్వర్గవాసులదగ్గరనైనా నేను చెయ్యలేను.

వరూధిని

మీధర్మములు మీలోకము దాటి రాలేవు సుమా. చూడు, నాహృదయ మెల్లా నీకోసం తటతట కొట్టు కుంటూందో? [జింకపిల్లను దూరముగా తోసి వక్షమును చూపుతోంది.]

ప్రవరుడు

[అటుచూడకుండా జింకపిల్లకేసి చూస్తూ] నాహృదయము నాజననీ జనకులకోసం ఎట్లు కొట్టుకొంటున్నదో నీకు తెలియదు.

వరూధిని

[వినిపించుకోకుండా] చూడు, నా రాజా, చూడు, ఈహిమాద్రి సౌందర్యమును సూర్యుడు తనకరాలతో ఎలా అనుభవిస్తున్నాడో! నక్షత్రసౌందర్యమును చంద్రు డనుభవించడం చూడలేదా! లేకుంటే ఈరాత్రి చూతువుగానిలే. ఈవనలక్ష్మిసౌందర్యము వసంతు డనుభవిస్తున్నాడు. చూడవేమి నారాజా! నేను వనలక్ష్మిని, నీవు నావసంతుడవు. అవునా!

ప్రవరుడు

నేను బ్రాహ్మణుడను.

వరూధిని

ఓహో, ఒకస్త్రీ హృదయము స్పందిస్తున్నప్పుడు దానితోపాటు నీహృదయంకూడా ఎప్పుడైనా స్పందించిందా నాస్వామీ!

ప్రవరుడు

ఇంద్రియసుఖాపేక్ష ధర్మమార్గానువర్తుల దగ్గిర వుండదు.

వరూథిని

ఇంద్రియసుఖమేనా ఆనందస్థితికి మూలకారణము ?

ప్రవరుడు

కాకుంటే యీమాటలన్నీ ఎందుకు వచ్చేయి నీకు!

వరూథిని

అయ్యో, వెర్రిరాజా! ప్రేమసుఖాన్ని ఎంతచులకన చేశావు! చంద్రికాచంద్రులకు, ఉమామహేశ్వరులకు, పద్మినీ కమలబాంధవులకు, కైలాసశిఖర నక్షత్రమండలములకు ఐక్యభావానికి కారణం ఇదా ?

ప్రవరుడు

మానవలోకపు సాంప్రదాయం నే చెప్పాను.

వరూథిని

కాదు. నారాజా, కాదు. మేఘగర్జనమున వాయువు స్పందిస్తుంది. శంకరావలోకనముంటే బ్రహ్మాండం స్పందిస్తుంది. సూర్యావలోకముచేత పద్మహృదయము స్పందిస్తుంది. నిన్ను చూస్తే నాహృదయం స్పందిస్తుంది.

ప్రవరుడు

ధర్మబద్ధులకు జీవితంలో ఒక్కమారే హృదయస్పందనము.

వరూధిని

నిన్ను దర్శించడంచేత మేల్కొన్న నూతనప్రేమ మారుతస్పర్శకు నదించే నాహృదయవీణాతంత్రుల శ్రావ్యగీతికలు నీకు వినిపించడం లేదా?

ప్రవరుడు

నా చెవులలో ప్రణవమే నదిస్తుంటుంది.

వరూధిని

చిన్నికృష్ణుని వేణుగానమైనా నీచెవులలో చొరదా?

ప్రవరుడు

ఓంకారరూపముగా పడుతుంది.

వరూధిని

అయ్యో, ఎంతకఠినహృదయము నీది, నారాజా!

ప్రవరుడు

అమ్మా, నాకు వేళ అతిక్రమిస్తోంది. ఇంటికి వెళ్లాలి. చేతనైతే మార్గం చూపు.

వరూధిని

నన్ను మించినవస్తువులు నీయింటివద్ద ఏమి వున్నవని యింటికి వెడతానంటావు?

ప్రవరుడు

దేవతార్చనం ఒకటి.

వరూధిని

ఊఁ.

ప్రవరుడు

పితృపూజ రెండు.

వరూధిని

సరి, సరి!

ప్రవరుడు

ఇల్లాలు నాకోసం వేచి వుండడం మూడు.

వరూధిని

చాలు, చాలు—ఈపాటి! వారు నావలె వాయు తరంగాలమీద సంచారము చెయ్యగలరా?

ప్రవరుడు

వారికి నడక సహజము.

వరూధిని

వారు తమకంఠా లెత్తి విశ్వవీణారవముతో శ్రుతి కలుపుకోగలరా?

ప్రవరుడు

లేరు.

వరూధిని

శాపానుగ్రహసమర్థులా నావలె వారు!

ప్రవరుడు

తపోధనమువారు మెచ్చించరు.

వరూధిని

వారికి నావలె జరామరణా లంటకుండా వుంటవా?

ప్రవరుడు

స్థూలదేహంపైన వారికి నమ్మకం లేదు.

వరూధిని

హృదయపీఠాన నిన్ను నెలకొల్పి నీపాదా లర్చిస్తూ నీ కమరత్వ మిచ్చి నీఅభీప్సితాలు నెరవేర్చగలరా నాస్వామీ, వారు?

ప్రవరుడు

కూడదు.

వరూధిని

మానవుల వూహాలకైనా అందని నందనవనకైలాససీమలయందు అస్తమయ మెరుగని ఆనందసూర్యుణ్ణి ఉపాసించగలరా, వారు?

ప్రవరుడు

లేరు.

వరూధిని

వారికోస మెందుకు ఇంతగా పాకులాడుతావు వెర్రిరాజా?

ప్రవరుడు

ధర్మముకోసమూ.

వరూధిని

ధర్మము ధర్మమంటావు, ఎక్కడి ధర్మమిది! నీధర్మములకు ఫలమూ నే నిక్కడ నీ కిస్తూంటే, వద్దని, తరువాత ఈ ధర్మాన్ని నీ వేమి చేసుకుంటావు!

ప్రవరుడు

దైవమే అది నిర్ణయిస్తాడు.

వరూధిని

వలపా, ధర్మమా ముఖ్యము! ధర్మముపేరు చెప్పి ప్రేమభావాలు చంపుకుంటారా?

ప్రవరుడు

పాపభీతి అక్కరలేదా మనుష్యులకు!

వరూధిని

పాప మెందుకు?

ప్రవరుడు

నీవు పరకాంతవు.

వరూధిని

ఊఁ.

ప్రవరుడు

నేను నూతన పురుషుడను.

వరూధిని

ఎట్లు?

ప్రవరుడు

ఎట్లేమి? అది సువిదితమే.

వరూధిని

అయ్యో, ఎక్కడిమాట లివి? మన మిద్దరమూ పాతస్నేహితులమే! మానవలోకాన్ని ఆవరించిన మాయ నీకన్నులు కప్పింది. అంతే. లేకుంటే ఈదేవలోకంలో తృప్తి పొందనినామనస్సు నిన్ను కని తృప్తిపొందడ మెందుకు?

ప్రవరుడు

నాపాప మది!

వరూధిని

కాదు, కాదు. ఇది పురాణపరిచయ ఫలమే.

ప్రవరుడు

ఏమో కాని, జీవితంలో ప్రేమ ఒక్కమారే.

వరూధిని

ఆఒక్కమారూ నీ వాప్రేమను అనుభవించావా?

ప్రవరుడు

నేను గృహస్థునే.

వరూధిని

మీ శాస్త్రాలు రెండవసారి ప్రేమించడము నిషేధిస్తవా?

ప్రవరుడు

ధర్మశాస్త్ర సమ్మతమైతే నిషేధించవు.

వరూధిని

అయితే నన్ను ఏలనాడుతావెందుకు?

ప్రవరుడు

నీవు అమర్త్యవు.

వరూధిని

అవును.

ప్రవరుడు

నేను మర్త్యుడను.

వరూధిని

అవును.

ప్రవరుడు

భూతభవిష్యద్వర్తమానములు నీకు కరతలామలకములు.

వరూధిని

అయితే?

ప్రవరుడు

మేము సంకుచిత ప్రజ్ఞులము.

వరూధిని

కానీ.

ప్రవరుడు

సంకుచిత ప్రజ్ఞులకూ దేవతలకూ సంబంధం ఎలా పొసగుతుంది?

వరూధిని

ఎందుకు పొసగరాదు?

ప్రవరుడు

ఒకరి జీవనానికి మృత్యువు మేర; రెండవవారికి ఆనందము పరమావధి.

వరూధిని

మృత్యువును పోగొట్టి సంతతానందం నీ కిస్తానుగా నేను. అయినా మృత్యువు ఆనందపదవికి దారి చూపుతుంది కదా.

ప్రవరుడు

మానవులఊహాలకు కా దేమో!

వరూధిని

మీకు మాత్ర మెందుకు కాదు? మీలోక మంతా

జీవనతరంగాలలో ఆడుతున్నది. మీ రసుకొనే మృత్యువు మార్పే కదా!

ప్రవరుడు

కావచ్చు, కాక పోవచ్చు. నిరవధికజీవులకే స్వేచ్ఛ. మేము కట్టు బాట్లను దాటిపోవడానికి స్వతంత్రులము కాము.

వరూధిని

[కోపము తెచ్చుకొన్నది. కుంతలములను వెనుకకు తోసింది. కన్నులు ఎక్కువగా సంచలిస్తున్నవి. అధరము కదులుతున్నది. జింక పిల్లను గట్టిగా దగ్గరకు లాగింది. నిలుచున్నది. ఒక మేఘము వచ్చి ఆమెను పల్చగా చుట్టుకొన్నది. మాటాడేటప్పుడు ఎదురుగా వున్న మేఘము చెదిరి, వూరుకున్నప్పుడు మళ్ళీ కలుసుకొంటున్నది. బయట చెట్లపైన పక్షులు పాట లాపినవి. వాయువు గమనము ఆపినాడు.]

నన్ను ఏమో సాధరణగా ఎంచి మాట్లాడుతున్నావు! నిన్ను ఈ పర్వతము మీదనే బంధించ గలశక్తి నాకు కలదు సుమా!

ప్రవరుడు

[చిరునవ్వుతో] ఊఁ!

వరూధిని

నీధర్మాలకు విఘ్నాలు కల్పించ గలశక్తి నాకు కలదు సుమా!

ప్రవరుడు

ఊ!

వరూధిని

నీస్థూలకాయాన్ని ఒక్కసారు నశింపజేసి నీ సూక్ష్మ దేహాన్ని గ్రహించగలశక్తి నాకు కలదు సుమా!

[వరూధిని దేహము కంపిస్తున్నది.]

ప్రవరుడు

ఊఁ.

వరూధిని

[మణి సౌధమును మేఘములు చుట్టుకొన్నవి. ఒక మేఘము లోన ప్రవేశించింది. వరూధిని దానిపైన చేతి నానించి గద్గదస్వరములో మాట్లాడుతున్నది.]

ఒక చేతితో నాహృదయ మిస్తున్నాను నీకు! రెండవ చేతితో మృత్యు విస్తున్నాను! ఏది కావాలి నీకు!

ప్రవరుడు

నాయింటికి ద ...

వరూధిని

అయ్యో, అయ్యో, అయ్యో!

[ఆమె కిందకూలబడింది. మరికొన్ని మేఘాలు వచ్చి ఆమెను చుట్టినవి. ఒక మేఘముపైన ఒక పాదము మోపి వేరొకమేఘముపైన చేతు లానించింది.]

నీకెంత భయం లేదు!

ప్రవరుడు

నాకెందుకు భయము?

వరూధిని

మృత్యువును చూపినా నీకు భయము లేదేమి మానవులకువలె?

ప్రవరుడు

నా దేహముకోసం ఇంత కొట్టుకొంటున్న నీవు నా దేహాన్ని నశింప జెయ్యగలవా?

వరూధిని

[మొగము చేతులతో కప్పుకొని]

లేను, నారాజా, లేను! ఇంతదాకా నీతో కఠినంగా మాట్లాడినాను. క్షమించు, క్షమించు!

ప్రవరుడు

ఈమాటు నాకింటికి దారి చూపించు.

వరూధిని

ఇప్పుడు చూపితే మళ్లీరావేమో?

ప్రవరుడు

మరణానంతరమే.

వరూధిని

అమ్మో, వద్దు! ఈలోపుగానే రా!

ప్రవరుడు

నే వెళ్ళుతా. ని న్నింత వేడుకొన్నా నీకు దయ కల గడం లేదు. నాకష్టాలు నేనే పడతా యీకొండమీద, నీచేతులో ప్రాణాలు కోలుపోయేబదులు, పితృదర్శన సిద్ధికి ప్రయత్నాలు చేస్తూ మేను విడవడమే మంచిది!

వరూధిని

నీకే కష్టములు! నీవే మేను విడవడం! వద్దు వద్దు!

ప్రవరుడు

అయితే నాప్రాణాలు నిలుపు!

వరూధిని

నా మాట వినవుగా?

ప్రవరుడు

[లేచి గుమ్మమువద్దకు వచ్చి] నే వెళ్ళుతా.

వరూధిని

[దీర్ఘముగా ఆలోచిస్తూ చాలాసేపు మాట్లాడదు. చివరకు]

మళ్ళీ వస్తావుగా? సంకల్పమాత్రంచేత నీవు ఇక్క డకు రాగలవుసుమా! నేను అలాగ చేస్తున్నాను... ఊఁ. వెళ్లు! మరి వెళ్ళు! మళ్ళీ రావాలిసుమా నాకొం

డా! రా! యేం! ఈమేఘాలు నిన్ను తీసుకు వెళ్లుత వితే! సన్ను మరవకుసుమా!

[ప్రవరుణ్ణి మేఘాలు అన్ని వేపులా చుట్టుకోగా అతను అంతర్హితుడవుతాడు. మణిపీఠముపైన వున్న వీణ దగ్గరకు లాక్కొని వేళ్లతో తీగెలు తెంపుతూ]

మానవులు ఎంతకఠినహృదయులు!

# కవిరాయడు : మహారాజు

ఒకనాటి ప్రాతఃకాలాన కవిరాయడు స్వప్నావస్థనుంచి మేలుకొన్నాడు. బాహ్యప్రపంచవైఖరి అతనికి గోచరించింది. నిజస్థితి అతడిమనస్సుకు తట్టింది. ఖిన్నుడైపోయినాడు! మహారాజుకు తనమీద దయ తప్పిపోయిం దని గ్రహించినాడు!

* * *

కవిరాయడు కవికుటుంబాన పుట్టినాడు, కవిగర్భాన జన్మించినాడు. అతను పుట్టినప్పుడు కోకిలలు కూసినవి, చిలకలు పలికినవి, మోడుచెట్లు చిగిరించినవి! లోక మంతా కవిరాయణ్ణి చూసి స్వాగత మన్నది.

ఆనమయాన కవిరాయడి తండ్రి తన హృదయాన్ని పరిశీలించి చూసుకొన్నాడు. కవిత్వానికి బదులు ఆనందరసం హృదయాన నిండి వుండడం గమనించినాడు. తన సంతానాన్ని ఆనందబాష్పాలలో ఒక్కమారు తలచుకొని "మహారాజుకు కృతిగా సమర్పించగల నాకడసారి ప్రబంధం వీడే గదా" అనుకొన్నాడు. తన చిన్ని ప్రబంధాన్ని మహారాజుచేతిలో బెట్టి నిద్రావస్థ చెందినాడు.

* * *

మహారాజు రాజ్యభారంతో మునిగి తేలుతున్నాడు. ఏది మంచి, ఏది చెడ్డ అనే విషయాలు నిర్ణయించుకొనడంలో కాలం జరిగిపోతున్నది. ఆయన ప్రజలను శాసిస్తున్నాడు, పన్నులు రాబట్టుకొంటున్నాడు, మహర్షుల ముఖాలవెంట ఉపదేశవాక్యాలు వింటున్నాడు. రాజ్యపాలనం కష్టమైనపని అనుకొంటున్నాడు. అప్పుడప్పుడు మహారాజు చెవులల్లో కవులగీతాలు పడుతూ వుండడం కలదు. అవి ఈర్ష్యాగీతాలో, ప్రణయగీతాలో ఆమహారాజు ఎలా నిర్ణయించుకోగలడు? కవిరాయడితండ్రి సమర్పించిన కుమారప్రబంధాన్ని మహారాజు ఎక్కడో పెట్టి మరిచిపోయినాడు.

* * *

కవిరాయడు చిన్ననాటి చెలికాళ్ళతో దృఢమైత్రి చేసుకొని ప్రపంచాన్ని మరిచిపోయినాడు. చిలకలతో జట్టుకట్టి తియ్యటిపలుకులు నేర్చుకొన్నాడు. కోయిలలతో సంచారం చేసి పలుకులకు పంచమ స్వరం అలవరుచుకొన్నాడు. గోదావరి నాశ్రయించి స్వేచ్ఛాగాన మభ్యసించినాడు.

అతనినివాసం ఎల్లప్పుడూ కొండలమీదా చెట్లమీదా. అతనిదృష్టి యెల్లప్పుడూ ఆకాశపథాన నక్ష

త్రమండలం వైపే. ఈసహవాసబలంచేత కొంతకాలం పాట పాడడమే మరిచిపోయినాడు కవిరాయడు.

సహవాసుల ప్రోద్బలంచేత కొంతకాలానికి మళ్ళీ గీతాలు పాడడం మొదలుపెట్టినాడు కవిరాయడు. ప్రకృతిగీతాలు, ప్రణయగీతాలు! చిలకలు కోకిలలు అతనిగీతాలు మెచ్చుకొన్నవి. ఇంతవరకూ లోకులు రంగుబొమ్మలను చూసి మెచ్చుకొనేవారు; సజీవమైన గీతాలను చూసి మూకీభావం వహించారు.

కవిరాయడి వంశంవా రంతా మహారాజుకు కృతు లిచ్చిన వారే. కవిరాయడు మాత్రం తనతొలిచూలి బిడ్డను చిలకలకూ కోయిలలకూ సమర్పించినాడు.

మంచి సావాసం చేయడం లేదని మహారాజు కవి రాయణ్ణి మరిచినా డన్నారు కొందరు; చిలకలకూ కోయిలలకూ కృతి యివ్వడం యుక్తం కాదని ఆగ్ర హించి వుండవచ్చునని మరికొందరన్నారు. నిజమైన సంగతి మాత్రం ఎవ్వరికీ తెలియలేదు.

* * *

మహారాజుకు తనమీాద దయ తప్పిందని తెలుసు కొని ఖిన్నుడై కవిరాయడు విషాదగీతాలు పాడ నారంభించినాడు. లోకాన్ని ఆవరించి వున్నదుఃఖ సముద్రంలో ఆ వన్నీ లీన మై పోయినవి!

కొంతకాలానికి తెలివి తెచ్చుకొని మహారాజుపైన గీతా లల్లినాడు కవిరాయడు. మహారాజుకు అందజేస్తానని చెప్పి వాయువు ఆగీతాలను తనగర్భంలో దాచుకొన్నది. మళ్ళీ కొత్తగీతాలు పాడినాడు కవిరాయడు. మహారాజుకు అందజేస్తామని చెప్పి చిలకలు ఆగీతాలు తమలో లీనం చేసుకొన్నవి. కొత్తకృతులు మళ్ళీ పాడినాడు కవిరాయడు. ఈమారు మహారాజుకు అందజేస్తామని చెప్పి కోయిలలు ఆకృతులను పుచ్చుకొని ఎక్కడికో లేచిపోయినవి!

చిన్ననాటి చెలికాళ్ళు తనపైన కోపించినట్లు కవిరాయడు గ్రహించినాడు. చిన్ననాటి సావాసగాండ్రను పూర్తిగా మరచినాడు. తనదృష్టి మహారాజు మీదికి మరల్చి ఎంతో విశ్వాసంతో ఆయనను హృదయపీఠాన నిలుపుకొన్నాడు. "ధనదేవతను ఉపాసిస్తున్నావా!" అని చిలకలు కవిరాయణ్ణి గేలి చేసినవి. "మేము లేని గీతాలు గీతాలా!" అని కోయిలలు పరిహాసం చేసినవి. "వంశమర్యాద కాపాడుకో వలెసుమా!" అని స్వప్నంలో కవిరాయడి తండ్రి ఆదేశించినాడు. కవిరాయడిదృష్టి ఎంతమాత్రం చెదరలేదు. ఒకటే లక్ష్యం—మహారాజు!

కవిరాయడికి యౌవనం వచ్చింది. మహారాజుకు దయ కలగలేదు!

* * *

కొంతకాలం ధ్యానముద్రలో వుండి తర్వాత మహారాజుపైన మళ్ళీ గీతాలు ప్రారంభించినాడు కవిరాయడు. సొంతంగా మహారాజుకు వాటిని కృతి ఇయ్యదలుచుకొన్నాడు.

కవిరాయడికి మహారాజు దర్శనం లభించలేదు. తనవంశీయుల పూర్వకృతులలో కలిపి గొంతెత్తి తన కృతులను పాడ మొదలుపెట్టినాడు కవిరాయడు. కార్య భారంలో వుండడం చేత గీతాలు మహారాజు చెవులలో పడలేదు.

నానాటికి గీతాలసంఖ్య హెచ్చిపోతున్నది. నిరంతరమూ పాటలు పాడడంచేత కవిరాయడి గొంతు బొంగురు పోతున్నది.

కార్య నిమగ్నుడై వున్నాడు మహారాజు. నిరాశ ఎక్కువవుతున్నకొద్దీ మహారాజు మీద విశ్వాసం అధికం కాజొచ్చింది కవిరాయడికి. ప్రచారార్థం తన గీతాలన్నింటినీ లోకం మీద విడిచి పెట్టినాడు కవిరాయడు.

గీతాలు పఠించారు లోకులు. "మహారాజు వ్యా

దయం వజ్రశకల!” మన్నారు కొందరు. “ప్రకృతిని వదిలిపెట్టినతర్వాత స్తోత్రపాఠాలలోకి దిగినాడు. గీతాలు పాడడం లే”దన్నారు కొందరు. “సత్కార్యానికి ఫలం ఆశించడం యుక్తం కా”దన్నారు వకకొందరు. “వంశమర్యాద మీరడం ఎంతరితర” మన్నారు మరికొందరు.

కవిరాయడికి లోకంమీద కోపం పుట్టింది. మనస్సులో ఒకానొకమూర్తిని ప్రతిష్ఠించుకొని తాను రచించిన కృతు లన్నింటినీ ఆమూర్తికి సమర్పించడం మొదలు పెట్టినాడు. ఆమూర్తే మహారాజన్నాడు కవిరాయడు.

ఎంతో కాలం గడిచింది. మహారాజుతల నెరిసింది. ఒళ్ళు ముడతలు పడ్డవి. రాజ్యభారం నానాటికి అతిశయిస్తున్నది.

కవిరాయడికి దృష్టి మందగించింది, చేతులకు వణుకు పుట్టింది. కంఠం రుద్ధ మవుతున్నది. గీతాలు పాడుతూనే వున్నాడు.

కవిరాయడిమీద అనుగ్రహం కలగలేదు మహారాజుకు; మహారాజుమీద విశ్వాసం తగ్గ లేదు కవిరాయడికి!

*

# "సాహితికి" కథ

తక్షణం కథ రాసి పంపవలసిం దని "సాహితి" సంపాదకుడు ఫర్మానా పంపినాడు. రాతాము, రాయవచ్చును అని రెండుమూడురోజులు ఎలాగో గడపినాను. ఇంక తప్పదు గదా అనుకొని ఒకనాటి రాత్రి వెన్నెట్లో పరుపు వేసుకొని, తమలపాకులు పక్కను పెట్టుకొని, దీపానికి ఎదురుగా కాగితాలు పెట్టుకొని, కూచుని ఆలోచించడం మొదలు పెట్టినాను. కథ సాంఘికం చేతామా, చారిత్రకం చేద్దామా, అపరాధపరిశోధకం చెయ్యడమా అని ఆలోచనలోకి దిగినాను. ఎంతకూ తెగడం లేదు. ఇంతలో పరుగెత్తుకొంటూ వచ్చినాడు మా చిట్టి బాబు; వచ్చి పక్కను కూచున్నాడు.

కూచుని "నాన్నా, నాన్నా, అమ్మం నిద్దరోయింది" అన్నాడు చిట్టి బాబు.

నేను ఆలోచనలో మునిగి వుండి "ఊహూఁ" అన్నాను.

"నాన్నా, మరి నా పేరెవరు?"

"నీ పేరా? చిట్టి బాబు."

చిట్టిబాబు సమాధానానికి సంతోషించి పరుపు మీద వెల్లకిలా పండుకొని ఆకాశంకేసి చూస్తున్నాడు. నేను సాంఘికకథ వ్రాతామని దృఢ పరుచుకుని ఏం పేరు పెట్టితే బాగుంటుం దని ఆలోచించాను. పేరును బట్టి ఇతి వృత్త మంతా బోధ పడవలె; సుర్రిగింజలో చెట్టంతా ఇమిడి వుండవలె. ఏం పేరు పెట్టను? కమల అంటే బాగుంటుంది. అయితే కమల కథ కంతకూ నాయిక కావలసి వుంటుంది. కమలను చిన్నపిల్లను చెయ్యడమా, కాపరం చేస్తూ వున్న—

—నాన్నా!

—ఊఁ.

—మరీ, నా పేరు చిట్టిబా బంటే బుల్లెమ్మ ఆక్షే పించిం దేం?

—ఊఁ అని ఊహా సూత్రాన్ని అందు కొందా మను కొన్నాను.

—ఏం నాన్నా, ఆక్షేపించిం దేం?

—ఎవరూ?

—చెల్లాయి.

—ఏ మని?

—పేరు బాగుంది కాదుట.

—బా గుం దమ్మా! మాట్లాడకు రవంత నేవు.

అయితే కమలను కాపరం చేస్తూ వున్న స్త్రీని చేస్తే బా గుంటుందా? అప్పుడు కథలో ఏమి చేయించాలి ఆవిడ చేత? ఆత్మ త్యాగమా? ఈకాలంలో సర్వసాధారణ మై పోయింది. సహగమనమా? దానికోసం శతాబ్దులు వెనక్కు వెళ్ళాలి. అయితే విషాద సూచకమైన కథకు కమల అనే ముద్దు పేరు బాగుంటుందా? బాగుండదు. పేరు మార్చాలి. ఏ మంటే బాగుంటుంది?

—నాన్నా!

—ఓ.

—చంద మామ ఎక్కడున్నాడో చెప్పుకో.

—అదుగో!

—నాన్నా!

—ఓ.

—చంధమామ అక్క డెందుకున్నాడు నాన్నా!

—వూరికేనే?

—నాన్నా!

—ఓ.

—చెల్లాయికి చందమామ లేదు కాదూ!

—అవు నమ్మా, పడుకో. మాట్లాడకు.

మాట్లాడకుండా చూస్తూ పడుకొన్నాడు చిట్టిబాబు.

కమల పేరు తీసివేసి వీరమతి అంటే? వీరమతి అట్టే నచ్చడం లేదు. పూర్వకాలపు పేర్లు ఏవైనా పెట్టితే కథ నిజ మయినట్టు తోస్తుంది. పూర్వపు పేర్లు ఏమున్నాయి? ఏదీ, అహల్య— ఉహూం. నాయకురాలు—చ్. గంగమ్మ— ఉహుం. ఏకవీర— బాగుంది. శక్తి పేరూ అయినట్టుగా వుంది, పూర్వకాలపు పేరూ అవును. కథ పేరు ఏకవీర పెట్టుకోవచ్చును. అయితే—

—నాన్నా!

—ఓయి.

—నాకు దాహ మవుతోంది.

—లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తాగు.

—అమ్మ నిద్దర పోతున్నది.

—నువ్వు వెళ్ళి బిందెలోనీళ్ళు ముంచుకు తాగు.

—నాకూ నిద్ద రొస్తూంది.

మంచినీళ్ళు ఇస్తేనే కాని కొరుక్కుతింటాడని లేచి మంచినీళ్ళు తీసుకు వచ్చి యిచ్చి నిద్ర పొమ్మన్నాను. కాకితాలముందర మళ్ళీ కూచుని . ఆలోచన. ఏకవీర చేత పురుష వేషం వేయించి యుద్ధం చేయిస్తే ఎలా వుంటుందో. కాకపోతే ఏకవీరకు దుర్మార్గుడైన భర్త వున్నట్టూ, అతను భార్యను అనాదరణ చేస్తూ వున్నట్టూ—

—నాన్నా!

—మళ్ళీ యెందుకూ?

—చెల్లాయికి ముద్దులు చేయిస్తున్నావు. నాకో!

—నీకూనూ.

—మరి, ఇందాక నువ్వు చెల్లాయిని ఎత్తుకుని ముద్దెట్టుకున్నావు కదా, నన్ను ఎత్తుకోలేదేం!

—నిన్నూ ఎత్తుకుంటా.

—నాన్నా! నన్నిప్పు డెత్తుకోవూ?

—ఊహుఁ.

—ఎత్తుకోవు నాన్నా?

—రేపు. ఈవాళకి నిద్దరో.

—నిద్దర పోతే నా కేం కొనిపెడతావు?

—మిఠాయి.

—నా కొద్దు.

—పోనీలే.

—నాకూ, నాకూ, సువ్వెక్కుతావే అలాంటి బైసికిల్ కావాలి.

—అలాగే. నిద్దరో.

—కొనిపెడతావా?

—ఆ.

చిట్టిబాబు కళ్ళు మూసినాక. గడియారంలో పది గంట లయింది. అయితే అయింది, కథ రాసి పడుకో వచ్చు నను కొన్నాను. అన్నట్టు ఎక్కడ వున్నాము- ఏకవీరకు దుర్మార్గుడైన భర్త. భర్త అనాదరణ పడ లేక, పడలేక ఏమిటి చెయ్యడం? నూతిలో పడితే! కథ చాలా పొట్టిదై పోతుంది. తిరగబడితే—నాయి కాలక్షణాలకు భంగం. పుట్టింటికి వెళ్ళిపోతే—వెళ్ళి పోయి! అవును, చెప్పకుండా పుట్టింటికి వెళ్ళిపోతే, భర్త యింటికి వచ్చి—

—నాన్నా!

—ఓ. ఇంకా నిద్ర పోలేదూ?

—పోయాను. కాని నాకు ఓనమాలు వచ్చాయి.

—వస్తే సంతోషమే.

రాత్రి పదిఘంటలకు ఓనమాల గొడవ యెందు కను కొన్నాను.

—నాన్నా, నాకు అ ఆ లు చెప్పుతా నన్నావు చెప్పవూ?

—ఇప్పుడు కాదు. పడుకో.

—ఎప్పుడు నాన్నా?

—రేపు.

—రేపు బళ్లోకి వెళ్ళేదీ నాన్నా?

—వెళ్ళు.

—ఆఁ వెళ్ళను.

—పోనీ, మానెయ్యి.

—మానేస్తే అమ్మ కొట్టదూ?

—కొట్టదులే.

—కొడుతుంది నాన్నా!

—కొట్ట దంటూంటే. నిద్ర పో.

మళ్ళీ రవంతసేపటికి చిట్టిబాబు నాన్నా అన్నాడు.

—ఓ.

—నువ్వేమిటి రాస్తున్నావు?

—కథ.

—నేనుకూడా రాయనా?

—ఇప్పుడు కాదు.

—నాకు కథ చెప్పవు నాన్నా?

—నిద్దరోతే చెప్తాను.

—చెపితే నిద్దరోతాను.

చిట్టిబాబు పట్టు మంకుపట్టు! పైగా నాదగ్గిర చనువు. ఇంక చేసే దేమిటి? కాకితాలు బొత్తుపెట్టి, ఒక మూల పడవేసి, దీపం ఆర్పి, పడుకొని, నూటపన్నెండోమారు...అనగా అనగా వకరాజు. ఆరాజుకు ఏడుగురు కొడుకులు. ఏడుగురు కొడుకులూ వేటకు

వెళ్ళి......కథ కంచెకు వెళ్ళింది, మనం ఇంటికి వచ్చాము అనేకథ చెప్పినాను. చీను దగ్గిరికి వచ్చేటప్పటికి నూట పన్నెండోమాటు చిట్టిబాబు నవ్వినాడు. తరవాత ఒకకాలు నామీద వేసి ఒక చెయ్యి నా ముఖంమీద వేసి ఇంతలో నిద్రపోయినాడు.

సాహితికి కథ రాయలేదని సంపాదకుడు కోపపడతాడు. కథ వ్రాయడం ఆవసరను వున్నది!

౧౯-౨౧

# పాఠము

ఒకసంవత్సరము చెన్నపట్టణములో కాపురము చేసి క్రొత్తబోధన పద్ధతులను నేర్చుకొన్నాను. అవి శిల్ప్యగతము లగుటవల్ల మనపూర్వుల విద్యాభ్యాసక్రమము పైన నాకు గౌరవము లేకపోయింది. ఈనేర్చినపద్ధతులన్నీ కొంతమట్టుకు క్లాసులలో ప్రయోగం చేయమొదలు పెట్టాను. కాని దానివిలువ విద్యార్థులు గ్రహించక పోవడంచేత 'ఓగు నోగు మెచ్చు' అనే వేమన్న పద్యం జ్ఞాపకం చేసుకొని మాట్లాడక వూరుకున్నాను. ఈపద్ధతులను ఉపయోగించడానికి సమయము రాక పోతుందా అని ధైర్యం.

ధైర్యం ఎందుచేతననూ అంటే, నాకు మూడేళ్ళ యీడుగల కొడుకు. వాడికి చదువునేర్చుకోవడానికి తగినవయస్సు—అనగా నాలుగుసంవత్సరములు వచ్చినట్లయితే సక్రమంగా పుస్తకాలలో వున్నరీతిగా బోధనపద్ధతులను ప్రయోగించి తద్వారా ఉత్తమవిద్య కరపించవలెనని నే నభ్యసించినమానసికశాస్త్రమును పురస్కరించుకొని పని జరిపినట్లయితే నాకొడుకు ప్రతిభాశాలి అవుతాడని నాధైర్యం.

విద్యాభ్యాసమును ఓనమాలతో మొదలు పెట్టరాదు. వస్తువుల యథార్థగుణగ్రహణము జ్ఞానేంద్రియములు చేస్తున్నవో చేయడం లేదో తెలిసికోవలెను. అట్లు చేయనియెడల వాటిని అభ్యాసపరిచి సరిగా గుణములు గ్రహించేలాగు చేయవలెను. అనగా బాలుడు తోలుదొల్త ఓనమాలను దిద్దుకొనడం మాని వేర్వేరురుచులను తెలిసికొనుట, వేర్వేరురంగులను తెలిసికొనుట, వేర్వేరువాసనలు తెలిసికొనుట, వేర్వేరు శబ్దములు గుర్తుపట్టుట, పదార్థముల వేర్వేరుస్థితులను తాకి తెలిసికొనుట నేర్చుకోవలెను. అట్లు నేర్చుకోవడంవల్ల వారిజ్ఞానేంద్రియాలు వస్తువులయథార్థగుణాలను గ్రహించగలిగి వుంటవి.

ఈవుద్దేశముతో నేను ఒకనాడు నిమ్మకాయ, బెల్లంముక్క, వక్కపొడి, పచ్చిమిరపకాయ ఇత్యాదులు రుచులు నేర్పుటకున్ను, గన్నేరుపువ్వు, పచ్చగడ్డి, మల్లెపువ్వు, దేవకాంచనము, మసిబొగ్గు, పసుపుకొమ్ము ఇత్యాదులు రంగులు నేర్పుటకున్ను సంతరించుకొని మావాడిని దగ్గర కూచోబెట్టుకున్నాను. మాఅమ్మ దూరంగా కూచుని పత్తిబుట్ట దగ్గర పెట్టుకొని వత్తులు చేసుకుంటున్నది.

నేను చదువు చెప్పడం మొదలు పెట్టాను. ఏకా గ్రచిత్తముతో విషయగ్రహణము చేయగలిగి వుండడానికి మావాడిని బాసినపట్టు వేసుకొని కూచో మన్నాను. విద్యాభ్యాససమయాన బాలురిస్వేచ్ఛను అరికట్టడం మంచిపద్ధతి కాదు. అందుచేత బాసినపట్టు వేసుకొమ్మని చెప్పినా మావాడికి స్వేచ్ఛ నేను తగ్గించ లేదు. రవంతసేపు బాసినపట్టు రవంతసేపు పండుకోవడం రవంతసేపు మొగ్గలు వెయ్యడం రవంతసేపు గంతులు వెయ్యడం మొదలైనపను లన్నీ చదువు చెప్పకొనేటప్పుడు మావాడు చేస్తూనే వున్నాడు. మొట్ట మొదట గన్నేరుపువ్వు పుచ్చుకొని "నాన్నా, ఇదేమి?" టన్నాను.

"ఇది పువ్వు."

"దీసిపే రేమిటి?"

"దీనిపే రేమిటి నాన్నా?"

"నువ్వు చెప్పు?"

"నువ్వు చెప్పవు నాన్నా ?"

"నేను చెప్పకూడదు. నువ్వు చెప్పుకోవాలి."

"నేను చెప్పవచ్చునా నాన్నా?"

"ఆ, చెప్పు."

"నేను చెప్పను, నువ్వే చెప్పుకో నాన్నా!"

"నాకూ తెలియదు. నువ్వు చెప్పు."

"నాకూ తెలియదు. నువ్వు చెప్పు."

"అయితే చెప్పుతాను విను. ఇది గన్నేరుపువ్వు."

"ఇది గన్నేరుపువ్వా నాన్నా?"

"అవును."

"నువ్వు ఎక్కడ తెచ్చావు నాన్నా దీన్ని?"

"దేవాలయం తోటలోంచి."

"నేనూ వెళ్ళి తీసుకురానా నాన్నా?"

"వద్దు. నువ్వు అట్టే మాట్లాడకు. నే చెప్పేది విను."

"మరి, గన్నేరుపువ్వు ఎందుకు తెచ్చావు నాన్నా?"

"చెప్పుతాను గాని—ఇది ఎలా వుంది?"

"మరి, నా కాపువ్వు ఇవ్వవు నాన్నా?"

"ఇంద పుచ్చుకో, పుచ్చుకొని దానిరంగు ఏమిటో చెప్పుకో."

"దీనిరంగా నాన్నా?"

"అవును. అదిగో రేకులు లాగి వెయ్యకు. అలాగ నలిపి వెయ్యకురా!"

"నలపను, గాని ఇంకోపువ్వు ఇవ్వవూ?"

"ఇది అయినతరవాత ఇస్తాను. నే నడిగిప్రశ్నకు సమాధానం చెప్పు."

"ఏమి చెప్పను నాన్నా?"

“దీనిరంగు”

“దీనిరంగా?”

“అవును.”

“నువ్వు చెప్పవు నాన్నా?”

“ఈమాటు నే చెప్పను. నువ్వు చెప్పుకోవాలి.”

“ఏమి చెప్పుకోవాలి నాన్నా?”

“దీని రంగు.”

“అంటే ఏమిటి నాన్నా?”

“ఇది తెలుపా, పసుపా, ఎరుపా, నలుపా చెప్పు.”

“ఇదా నాన్నా?”

“అవును.”

“ఇది తెల్లగా వుంది.”

“ఇది తెల్లగా వుందా? పోనీ యీమల్లిపువ్వేలా వుంది?”

“ఇదా నాన్నా? ఇది ఎం చక్కుగుంది!”

“దీనిరంగు?”

“తెల్లగా వుంది.”

“ఈ రెండూ తెల్లగానే వున్నాయా?”

“తెల్లగా లేవు నాన్నా!”

“లేవు. గన్నేరుపువ్వు ఎరుపు, మల్లెపువ్వు తెలుపు, మళ్ళీ చెప్పు.”

"ఇది ఎరుపు, ఇది తెలుపు."

"సరే, యీమసిబొగ్గు ఎలా వుంది?"

"ఇదా, యిది ఎర్రగా వుంది."

"ఇది ఎర్రగా వుందిట్రా!"

"మరి ఎలా వుంది నాన్నా?"

"నల్లగా వుంది."

"మసిబొగ్గు నల్లగా వుంది."

"సరే, ఈపచ్చగడ్డి!"

"ఇదీ! ఇది నల్లగా వుంది."

"ఇది మసిబొగ్గులాగ వుందిరా?"

"ఎలా వుంది మరి?"

"ఇది ఆకుపచ్చగా వుంది."

"ఆకుపచ్చగా వుంది."

"సరే, యీమాటు మళ్ళీ చెప్పు. గన్నేరుపువ్వు ఎలా వుంది?"

"ఎర్రగా వుంది."

"మసిబొగ్గు?"

"నల్లగా వుంది."

"మల్లెపువ్వు?"

"ఆకుపచ్చగా వుంది."

"ఆకుపచ్చ కాదు, తెలుపు."

"ఆకుపచ్చ కాదు, తెలుపు"

"పచ్చగడ్డి!"

"పచ్చగడ్డి ఆకుపచ్చ కాదు—"

"ఆకుపచ్చే."

"ఆకుపచ్చగా వుంది."

"సరే. ఇది జ్ఞాపకం వుంచుకుంటావు కాదూ!"

"ఆలాగే, నాన్నా. నాకా బెల్లంముక్క పెట్టవూ!"

"ఇందు. మరి అదంతా తినెయ్యకు!"

ఇంతట్లో యింటిలోంచి నాభార్య కేకవేసింది.

"అవునుగాని, కచేరీకి వేళయినట్టు వుంది. మీ అమ్మ వుండలేరు. కుర్రాడితో ఆడుకొనేబదులు స్నానం చెయ్యకూడదూ!"

"ఇదిగో లేస్తున్నా."

లేస్తూండగా మాఅమ్మ వత్తులు, పత్తిబుట్టలో పెట్టి మూతవేస్తూ అన్నదిగదా "అబ్బాయీ, ఎప్పటికప్పుడు వాడితో అలాగ ఆడుతావు. వాడికి రెండు ముక్కలు చెప్పుతూ వుంటేగాని వాడికి చదువు వచ్చేవిధంఎలాగ?"

మొత్తంమీద ఆడవాళ్ళు— ఏమన డానికీ నోరు రాదు!

# ఎన్నో చేస్తాను!

వీధిఅరుగుమీద కూచోబెట్టి పలకా పలక ఫుల్లా చేతికిచ్చి ఓనమాలు దిద్దుకుంటూ వుండమన్నాడు నాన్న. "వీధులంపట తిరుగుతూ అల్లరి చేస్తే తంతాను. నేను చూస్తూనే వుంటాను సుమా" అన్నాడు.

నాన్నే చూడకుండా వుంటేనా!

గడ్డి మేస్తూవున్న ఆమేకపిల్లను నిమ్మళంగా వెనకాలే వెళ్ళి పట్టుకుంటాను. చెవులు పట్టుకుని యింటికి లాక్కువస్తాను. తాడు దానిమెడకు కట్టి ఆతాడు గుమ్మానికి కడతాను. అమ్మ చూడకుండా బెల్లంముక్కా చేగోణీలూ తీసుకువచ్చి దానికి పెడతాను. తరవాత చిన్నకొరడా ఒకటి కట్టి ఆకొరడాతో దాన్ని చెల్ చెల్ అని తోలుతాను. ఆతరవాత దాన్ని పడుకోబెట్టి పక్కను కూచుని దువ్వుతాను. దువ్విదువ్వి దానిమెడ మీద నేను నిద్దరోతాను. ఎంచక్క!

నాన్నే చూడకుండా వుంటేనా!

సన్నసన్నంగా నాన్నగదిలోకి వెడతాను. నాన్న నన్నెప్పుడూ ఒక్కవుత్తరమేనా రాయనిచ్చేవాడే కాడు. నాన్న రెండుకలాలూ రెండుచేతులతోటి పుచ్చుకుంటాను. రెండుకవర్లు ముందుపెట్టుకుని ఆరెండుకవర్ల

మీాదా ఉత్తరం రాస్తాను. నాన్నకోవుత్తరమూ, అమ్మకోవుత్తరమూ. కుక్కపిల్లకీ, మేకపిల్లకీ యింకో రెండుత్తరాలు రాస్తాను. ఈవుత్తరాలు కుక్కపిల్లకీ మేకపిల్లకీ నేనే తీసుకువెళ్ళి యిస్తాను. నాన్నవుత్తరమూ అమ్మవుత్తరమూ పోష్టులో పడవేస్తాను.

మధ్యాన్నము పోష్టుజవాను అమ్మకీ నాన్నకీ వుత్తరాలు ఇస్తాడు.

"ఈఉత్తరాలు ఎవరు రాశారు చెప్మా" అంటారు నాన్నా అమ్మాను. నేను ఉలక్కుండా పలక్కుండా ఊరుకుంటాను.

నాన్నే చూడకుండా వుంటేనా?

ఒకగావంచా కట్టుకొని యింకోగావంచా బుజం మీాద వేసుకుని కాలవకు వెడతాను. వెళ్ళి ఎవరూ చూడకుండా నీళ్ళల్లోపడి నీళ్ళమీాద తేలుతాను. మునుగుతూ తేలుతూ ఎంతోసేపు ఆడుకుంటాను. నీళ్ళల్లో మునిగి అడుగున ఏముందో చూస్తాను. ఆలిచిప్పలూ బొమ్మరాళ్ళూ గావంచాలో మూటకట్టుకుంటాను. ఆపాళంగా ఒడ్డుకు వచ్చి ఒళ్ళు తుడుచుకుని యింటికి వస్తాను. అప్పుడు అమ్మ అంటుందిగదా, "నాన్నా, యింతసేపూ ఎక్కడకు వెళ్ళి ఏంచేస్తూన్నావు!"

అప్పుడు నే నంటాను కదా, "అమ్మా, అమ్మా, వాళ్ళబ్బాయి రబ్బరుబొమ్మ కొనుక్కున్నాడు. నాక్కూడా కొనిపెట్ట మనవు టే నాన్నని!"

నాన్నే చూడకుండా వుంటేనా !

నాన్నగిదిలోకి పిల్లిపిల్లలాగ చప్పుడు చెయ్యకుండా వెడతాను. ఆపళంగా లోపలతలుపు గడియవేస్తాను. నాన్నపంచ కట్టుకుంటాను. నాన్నపెద్దకోటు వేసుకుంటాను. నాన్న పెట్టుకునేజరీతలపాగా పెట్టుకుంటాను. పెద్దబూట్సుజోడూ సులోచనాలూ పెట్టుకుంటాను. చేత్తో కర్ర పుచ్చుకుంటాను. నాన్న వాచీ తీసి చెవి దగ్గిర పెట్టుకుని చూసి దాన్ని ఒక్కమారు గర్రున తిప్పేస్తాను. అప్పుడు కోటుజేబులో పెట్టుకుంటాను. పెట్టుకుని గదితలుపు తీసి వీధిలోకి షికారు వెడతాను. తిన్నగా బొమ్మలదుకాణం దగ్గిరకు వెళ్ళి ఆబొమ్మలన్నీ కొనేస్తాను. బ్రాహ్మణ దుకాణంమీదకు వెళ్ళి అక్కడ కారప్పూస అంతా కొనేస్తాను. ఆపళంగా ఇంటికి వస్తాను. అప్పుడు, ఈ బొమ్మలూ కారప్పూసా ఎక్కడివిరా? అంటుంది అమ్మ. "నే బజారుకు వెళ్ళి కొన్నాను!" అంటాను.

నాన్నే చూడకుండా వుంటేనా!

నాన్న నడవలో పెట్టినసైకిలు వీధిలోకి తీసుకు

వచ్చి ఎవరూ చూడకుండా ఎక్కుతాను. ఎక్కి రం యిమని రోడ్డుమీద సవారిచేస్తాను. తిన్నగా వెళ్లివెళ్ళి ఎదురుగుండా వున్నఆకాశాన్ని ముట్టుకుంటాను. ఆకా శానికి బైసికిలు జేర్లాబెట్టి అక్కడ పువ్వులూ పళ్ళూ జేబునిండా వేసుకుంటాను. కొంతసేపు నిద్దరోయి మ ళ్ళీ బైసికిలు ఎక్కి యింటికి వచ్చేస్తాను. వచ్చి అమ్మకు పువ్వులూ నాన్నకు పళ్ళూ యిస్తాను. అమ్మ ముద్దెట్టు కుంటుంది, గాని నాన్న తంతాడేమో!

నాన్నే చూడకుండా వుంటేనా!

పెరట్లో నూతిదగ్గిర జామిచెట్టు ఎక్కుతాను. ఎక్కి కొమ్మమీదినుంచి నూతులో ఏముందో చూస్తాను. జామికాయలు తుంపి నూతిలోకి విసురుతాను. బుడుం గు బుడుంగుమని దాంట్లో పడుతూంటే చూస్తాను. ఆఖరవాట జామికాయలు జేబునిండా వేసుకొని దిగి వచ్చి పశువులశాలలోకి వెళ్ళి అన్నీ తినేస్తాను. అమ్మకీ నాన్నకీ ఒక్కకాయేనా పెట్టను.

నాన్నే చూడకుండా వుంటేనా!

నాన్నగదిలో బొమ్మలపుస్తకా లన్నీ తీస్తాను. అం దులో బొమ్మలన్నీ చింపుతాను. చింపి దారంతో వాటి నన్నింటినీ దండలాగ గుచ్చుతాను. గుచ్చి ఆదండ తువ్వాయిమెడలో వేస్తాను. వేసి ఆతువ్వాయిని కొర

డా వుచ్చుకొని వీధులంపట పరుగెత్తిస్తాను. లేకపోతే ఆకాగితాలన్నీ పడవలు కట్టి తూము కాలవలో వేస్తాను. పడవల్లో చీమలని ఎక్కించి వదుల్తాను. అవి రయ్యిన పడవల్లో వెళ్లిపోతాయి. ఎంచక్కా!

నాన్న చూడకుండా వుంటేనా!

పెరట్లో గోడపక్కని నీళ్లుపోసి మన్నంతా తవ్వుతాను. తవ్వి ఆమన్నుతో పిచ్చికగూళ్ళు కడతాను. కట్టి ఆగూళ్ళల్లో బెల్లంముక్క పెట్టి చక్కావస్తాను. పొద్దున్నే లేచివెళ్ళి ఆగూళ్ళల్లోకి పిచ్చికలు వచ్చేయేమో చూస్తాను.

నాన్న చూడకుండా వుంటేనా! పలకా పలకపుల్లా అవతల పారేసి ఇంకా ఎన్నో చేస్తాను!

౧౯-౭౧

# మన్మథ సందర్శనము

చాలాకాలంనుంచీ మన్మథుడి దర్శనం చేసుకోవాలని కుతూహలం వుండేది. అది నేటికి గాని సిద్ధించింది కాదు. ఎలా సిద్ధించిందో చెప్పడానికి వీలు లేదు. ఆవిషయాలు రహస్యాంగా వుంచే షరతు మీాదనే కామదేవుడి దర్శనం నాకు లభించింది గనక ఆవిషయాలు వెల్లడి చేయడానికి వీలు లేదు.

వేటకు వెళ్ళడానికని మన్మథుడు స్నేహితులతోనూ సహచరులతోనూ సిద్ధంగా వున్నాడు. ఆయన ఫలానా తావున వున్నాడని నిశ్చయించ లేకపోయినాను.

ఒకవైపున, చిగురుటాకుల పట్టము కట్టుకొని, సిందూరము బొట్టు పెట్టుకొని, తోయుజప్రసూనాలు తోరణం కట్టుకొని, వనలక్ష్మితో సరస మాడు తున్నాడు వసంతరాయుడు.

చల్లని నీళ్ళల్లో జలకా లాడి, దేహంనిండా పుప్పొడి పూసుకొని, మేఘాల వెంబడి వేటాడ డానికి జింక బాబా నెక్కి సిద్ధంగా వున్నాడు వాయుదేవుడు.

ఇంకోచోట, నల్లటి గొడుగు వేసుకొని, తెల్లటి బట్టలు కట్టుకొని, అస్తమానం నవ్వుతూ, చక్కని చుక్కలతో సరసా లాడు తున్నాడు చందమామ. అతన్ని చూసే సరికి మతి పోతుంది.

మరోచోట విల్లు కనిపిస్తున్నది. ఎక్కు పెట్టిన వింటిలో బాణాలు అవుపిస్తున్నవి. కిలకిల లాడుతూ చిలకలూ, కోకిలలూ రెక్కలతో వింజామరలు వేస్తున్నవి. కళ్ళు మిరు మిట్లు గొలిపే అందం మూర్తీభవించిందా అనేలాగు తోచే సుందరాంగి—రతీదేవి కాబోలు—ఒక పక్కన కని పిస్తున్నది. కామదేవుడు కన బడడం లేదు. అయినప్పటికీ, కొంచెం వూహించి ఆస్థలాన ఆయన వున్నట్టు నిశ్చయించుకొని సమీపించి "కామదేవా, నమస్కారము!" అన్నాను. నిత్య శోభన మస్తు!" అనే మాటలు వినబడ్డవి.

"తమ రూప దర్శనం చేసుకోవడానికి నా బోంట్లకు అనుజ్ఞ దయ చెయ్యరా!" అన్నాను. అని వెంటనే చాలా నొచ్చుకొన్నాను. కామ దేవుడికి జరిగిన పరాభవం జ్ఞప్తికి తేవడం తప్పు. మాట జారిపోయింది! నా ప్రశ్నకు సమాధానం రాలేదు.

"తమ సౌభాగ్యం చూచి పోవడానికి ఎంతో శ్రమ మీద ఇక్కడికి వచ్చాను" అన్నాను. అనే అనడం

తోనే—ఆయన ఆజ్ఞ పొందినాడు గాబోలు—వాయు దేవుడు నన్నెత్తుకొని పోయి కామదేవుని ఆయుధా గారంలో దింపినాడు.

ముల్లోకాలనూ అవలీలగా జయించిన మహాయోధ ఆయుధాలు అయిదే అని యిదివరలో నా వూహా. కాని అక్కడ చాలారకాల పువ్వులూ, చిగుళ్ళూ, తులసి దళాలూ, దర్భలూ, మొగలిరేకులూ ఇంకా యేమేమో వున్నవి. అప్పుడు వాయుదేవుడి కేసి తిరిగి అడిగాను ‹‹అరవిందము, అశోకము, చూతము ఇత్యాది అయిదు బాణాలే కదా మన్మథునివి. ఇవన్నీ యెందుకు!''

వాయుదేవుడు నవ్వి యిలా అన్నాడు. ‹‹వెర్రివాడా, పూర్వ యుగాలలో ఆబాణాలు వినియోగించేవాడు, స్వర్గలోకంలో ఇప్పటికీ ఆఅయిదే వినియోగిస్తాడు. కాని భూలోకాన కలికాలాన పరిస్థితులు మారడంచేత ఇన్నిరకాల బాణాలు కావలసి వచ్చింది. వినలేదా భూలోకంలో ప్రచారంలో వున్న ఈ పద్యం—

జవరాలి బోడగన్న సన్యాసిపై నేయు
తులసి లేజిగురాకుతూపు మరుడు;
వేదవిప్రుని గన్నవిధవపై ఝళిపించు
దర్భపల్లవహేతి దర్పకుండు;

కటకారకులకన్య కనిన పాళికుమీద
బోడుచు బూమునికోల పుష్పశరుడు;
వాడింధముని కన్నవాతిపై నేయును
వలరు జిచ్చరకోల నంగభవుడు;
బెరిసి వెన్నెల గాయంగ వేరకమ్ము
పులినతలముల వాయూయికోలము బెరిగి
దాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
వసమబాణుండు తిరుణాళ్ళ నన్నివాళ్ళు

"అయితే భూలోకంలో పరిస్థితులు మారడంవల్ల మన్మథుడికి పని యెక్కువయినట్టు తోస్తుంది. పూర్వ యుగాలలో వసంతకాలంలో మాత్రం మన్మథుడికి పని వుండేది. అప్పు డయినా పర్వదినాలనీ, ఏకాదనులనీ ఇలాంటి సెలవుదినా లుండేవి. ఈయుగంలో అన్ని కాలాలలో అన్నిపూటలా చేతినిండా పనే. అందుచేత నే ఆయుధాలు హెచ్చు చేయవలసి వచ్చింది. ఆఫీనుకూ డా వృద్ధి చేయవలసి వచ్చింది."

అంతట ఒకమూల మరతుపాకీ, పిస్తోళ్ళూ చూసి ఆశ్చర్యపడి అవి యెందు కని వాయుదేవుణ్ణి అడిగాను. ఆయన అన్నాడు: "చెప్పలేదా ఈకాలంలో అలాంటి వి కావలసి వచ్చా యని? వింటినుంచి వదిలినబాణాలు కొందరిమీద పని చెయ్యవు. ఆలాటివాళ్ళను పిస్తోలులో

వువ్వులు పెట్టి కొడతాడు. తిరునాళ్ళు జరిగేటప్పుడూ పెద్దపెద్దసభలలోనూ, పశ్చిమదేశవాసుల విందులలోనూ, తోటవిందులలోనూ తనకు కష్టం లేకుండా వుండేటందుకు సంఘంమీద ఒక్కసారిగా మరతుపాకీ ప్రయోగిస్తాడు. చాలాదూరాన వున్నలక్ష్యాన్ని కొట్టడానికి ప్రత్యేకంగా తుపాకు లున్నవి. వాయువిమానాలలో వెళ్ళేపాశ్చాత్యులమీద ప్రయోగించడానికి మాత్రం అవి ఉపకరిస్తవి."

"అయితేఇంతపనీ ఒక్కమన్మథుడే చేసుకోగలడా?"

"ఆయనకు లోటేమిటి? ఎంతసిబ్బంది వున్నది! అందరూ ఆయనకు సహాయం వస్తారు. చంద్రుడిబాణాలుమట్టుకు మతిసంచలనంమాత్రం చేస్తవి. చూడు మన్మథుడిపద్దులు!" అని నాకు వాయుదేవుడు పద్దులు చూపినాడు. ఆయన దినచర్యా మాసచర్యా, సర్వమూ అక్కడ వ్రాసి వున్నవి. ఆలెక్కలు సంవత్సరాంతానికి విష్ణు మహేశ్వరులకు వెళ్ళవలె. ఒకనకలు బ్రహ్మదేవుడికి కూడా పంపినట్టు ఉదహరించి వున్నది. సృష్టిస్థితిలయాలు ఒక్క తాకీగా జరుగుతూ వుండడానికి ఈలెక్కలు త్రిమూర్తులకూ అవసర మని తోచింది. వాయుదేవుడు తొందరచేస్తూవున్నా ఏదేశంలో ఎక్కువబాణాలు వినియోగ పడ్డవో వినోదం తెలుసుకోవలె

నని పద్దులు తిప్పి చూచాను. మొదట ఫ్రాంసు, తర్వాత ఇంగ్లండు—ఇలా వున్నవి. మన హిందూదేశము ఏచివర సంఖ్యలలోనో కనబడ్డది.

"అయితే మన్మథుడు ఎక్కడ తరుచుగా వర్తిస్తూ వుంటాడు?" అన్నాను.

"నీవూహా యేమి?"

"అల్పజ్ఞుణ్ణి. నాకు తెలియదు. అయినా మాలోకంలో అనుకోవడం మాత్రం ఇది—

సంధివిగ్రహయానాది సంఘటనల
బంధకీ జారులకు రాయబారి యగుచు
పట్టణంబున నిత్యంబు పవలు రేలు
పూటకూటింట వర్తించు బుష్పశరుడు.

మరిన్ని మన్మథ కూటమే వేశ్యావాటిక అని తలుస్తారు."

"ఆమాత్ర మయితే బాగానే వున్నది. ఇప్పుడు ఆయన వర్తించని ప్రదేశమేలేదు. అందులో ముఖ్యంగా సముద్రతీరాలు, ఉద్యానవనాలు, ఉత్సవాలు, జూదపు కొంపలు, మద్యపుదుకాణాలు, ఓడలు, రైలు బళ్ళు, వాయు విమానాలు. ఇంకో చిత్రం. ఇప్పుడు మన్మథుడు తన బాణాలు టెలిగ్రాఫు తీగెలలో నుంచీ, టెలిఫోను తీగెలలోనుంచీ పంపవలసి వస్తున్నది."

"అయితే మాలోకంలో పోష్టాఫీసు ఉద్యోగస్థుల కు వలె మన్మథుడికి సెలవులు లేనట్టు తోస్తుంది."

"అలాగే. ఇక వేటకు వేళ అయింది. వెళుదాము రా!" అని నన్నెత్తుకు పోయి యథాస్థానం చేర్చాడు వాయుదేవుడు.

అందరూ వేటకు సన్నద్ధులై బయలు దేరారు. ఈ తమాషాకూడా కొంచెం చూతామని నేనూ వెనక బయలు దేరాను. ఎప్పుడు చేరామో ఎలా చేరామో నాకు తెలియదు. కాని రెప్పపాటుకాలంలో మే మంతా భూలోకంలో వున్నట్టు గ్రహించాము.

మధ్యాహ్నం మొదలు మళ్లీ తెల్లవారేదాకా మన్మథుడు ఆడినవేట వర్ణించడానికి భారత మంత గ్రంథం అవుతుంది. అందులో కొన్ని ముఖ్యమైన సంగతులుమాత్రం చెప్పి మిగిలినవి ఊహకు వదలుతాను.

వేటాడడంలో సాంప్రదాయం సాధారణంగా బాణానికి సులభంగా లొంగే జంతువుల జోలికి వేటకాడు వెళ్ళకపోవడము. అందు చేతనే పందిని వేటాడడ మన్నా జింకను వేటాడడ మన్నా చెవి కోసు కొంటారు. కాని మన్మథుడి సాంప్రదాయం ఇది కాదు. ఎవరు బాణాలకు త్వరగా చిక్కుతారో వారిమీదే బాగా బాణాలు ప్రయోగిస్తాడు. ఇందుకు తార్కాణం

పరాసుదేశపుస్త్రీలు బాణము చూడడంతోనే గడగడా వణుకుతారు. వింట సంధించి బాణాలతో కొట్టను వారిని మన్మథుడు; చేతితో పువ్వులు విలాసంగా విసురుతాడు. అప్పుడు వాళ్ళు పడేక్షోభ చెప్పడానికి అలవి కాదు! కాఫీక్లబ్బులకు పరుగెత్తేవాళ్ళూ, నాటకశాలలకు పరుగు లెత్తేవారూ, తోటలకు పరుగు లెత్తేవారూ, పరదేశాలకు పరుగు లెత్తేవారూ! పరాసుదేశపు పురుషులమీద మన్మథుడు ఆట్టేబాణాలు వెయ్యలేదు; పిస్తోలులో పెట్టి కొట్టేవాడు. ఇంగ్లీషుయువతులుకూడా పరాసుయువతుల చెల్లెళ్ళే ఈవిషయంలో.

మదరాసు సముద్రతీరం దగ్గిర విశేషాలు చెపుతాను. ఒక అయ్యరు గూడకట్టు కట్టుకొని అలా వెళ్లుతున్నాడు. పిస్తోలులో పెట్టి మన్మథుడు ఒక్క పువ్వు పేల్చినాడు. వింటినుంచి వదిలిన పువ్వులు అయ్యర్లమీద పని చెయ్యవట. పేల్చినా ఆపువ్వును అతను దులిపేసుకొని వెళ్ళిపోవడం మొదలు పెట్టినాడు. నా కాశ్చర్యమయింది. వాయుదేవుణ్ణి అడిగినమీదట దాని యథార్థకారణం తెలిసింది. బుద్ధి కొంచెమైనా మన్మథముఖమై వుంటేనే కాని బాణాలు పనిచెయ్యవు. ధనకాంక్ష గల అయ్యర్లమీద పిస్తోలుదెబ్బ పడకపోవడానికి కారణం అది. మోక్షకాంక్ష వున్నవారి మీదకూడా

పనిచెయ్యవట. కాని మన్మథుడు అలాంటి వాళ్ళ విష యంలో సూటిగా వున్న మొగలిరేకులు వింటి కను సంధించి కొడతాడు. అప్పుడు ఎవ్వరూ లొంగకుండా వుండలేరు.

మన్మథుడు ఒకకొంటెతనం చేసేవా డిక్కడ. దాక్షిణాత్య వైష్ణవవధూటులవెనక పొంచుండి సాధారణంగా బాణాలు వేసేవాడు. అటువంటి బాణాలు గురి తప్పకుండా వెళ్ళి అమోఘంగా పని చేస్తవి.

బొంబాయి సముద్రతీరం దగ్గిర ఒకవింత జరిగింది. ఒకనవనాగరీకుడు ఒకఇంగ్లీషు యువతితో కలిసి షికారు వచ్చాడు. మన్మథుడు అతనిమీద ఒకబాణం వేసి ఇంకో బాణం ఆవిడ మీద విసిరినాడు. ఆనాగరీకుడి ఓవర్ కోటు తక్షణం కింద రాలింది. యువతి ఆకోటు మీద మూర్ఛపోయింది!

మన్మథబాణాలు రకరకాల మనుష్యులమీద రకరకాలపనులు చేస్తవి. ఆమనిషి శరీరతత్వాన్ని బట్టి వుంటుంది. కొందరికి కూనురాగాలు పుడతవి, కొందరికి మీసాలపైకి చేతులు పోతవి, కొందరికి కళ్ళు చలించి దారి కనపడదు, కొందరికి పైత్యవికారం కలుగుతుంది.

మన్మథుడు మొత్తంమీద కొంటె ముండావాడు. పెద్దా పిన్నా తారతమ్యం అతగాడికి లేదు. బీదవాళ్లు భాగ్యవంతులూ అనే భేదం కూడా లేదు. కాకపోతే,

దేవుడుగుళ్ళల్లోకి వెళ్ళే స్త్రీ పురుషులమీద బాణాలు వెయ్యడం ఏమి భావ్యంగా వుంది? ఒకచోట కొందరు స్త్రీ పురుషులు ప్రార్థనార్థమై చేరినారు. మన్మథుడు ఆయింట్లో ప్రవేశించి అందరిమీదా పువ్వులు చల్లి లేచి వచ్చినాడు. అప్పుడు ఒక్కొక్కరిలోనూ పుట్టిన చిత్తవృత్తులు ఏమని చెప్పను!

ఒకచోట ఒకానొక విద్యార్థి పుస్తకం విప్పి చదువు కొంటున్నాడు. అతగానిమీద ఒక్కబాణం విసిరినాడు మారుడు. ఆవిద్యార్థి పాపం! బ్రహ్మచారి. తక్షణం అతగాడు ఇంటికి పరిగెత్తి పాతవార్తాపత్రికలు వెతికి వీర్య వృద్ధి ఔషధాలు వీ. పి. గా తెప్పించుకొన్నాడు.

ఇంకోచోట ముసలిభర్త, పడుచు పెండ్లామూ వుండడం చూసి, మన్మథు డాపడుచుమీద లక్షపూలు విసరినాడు. ముసలిభర్తమీద ఒక్కపూవైనా వెయ్యకుండా వెళ్ళిపోయినాడు. పాపం! ఆముసలివాడు పుత్రకాంక్షతో కాశీ రామేశ్వరాలు వెళ్ళివచ్చినాడట.

మన్మథుడి కొంటెతనం ఇలా వుంటుంది. ఇంకా ఎన్నో తమాషాలు చేశాడు.

ఈవిషయాలు భూలోకంలో ప్రకటించడానికి ఆయన దగ్గర అనుమతి పుచ్చుకొని తిరిగి వచ్చాను.

# గాలిపాటు

## ౧

నేను బీదకుటుంబములో పుట్టి పెరిగినవాడ నైనప్పటికీ ఉన్నతవిద్యలు పొందనివాడ నైనప్పటికీ, ఒక్కమారు హఠాత్తుగా లక్షాధికారిని కావడముకు కారణ మేమో ఒక రిద్దరికితప్ప మరెవరికీ తెలియదు. అంతే కాకుండా నేను ఏకుటుంబమునైతే దూషించేవాడనో ఆకుటుంబములో పుట్టినకన్యకను వివాహముచేసుకొని సుఖంగా కాపురం చేస్తూవుండడంకూడా ప్రజలకు వింతగానే వుంది. కాని దానికారణంకూడా యెవరికీ తెలియదు. దీని కంతకూ పెద్దగాధ వున్నది. చెప్పుతా వినండి.

వేసవికాలం ఒకనాటిమధ్యాహ్నం వూసుపోక మా ముత్తాతగారి వ్రాతప్రతులుంచినతాటాకుపెట్టె ముందర వేసుకొని కాలక్షేపం చెయ్య తలుచుకున్నాను. మా ముత్తాతగారిపేరు లోకంలో మోగిపోయింది. వ్యాకరణంలో అంతవారు లేరనీ యిక వుండరనీ నేటికికూడా చెప్పుకోవడం కద్దు. వారు పన్నెండోయేట చదువుకునే వూహాతో కాశీ లేచిపోయినారట. అక్కడ పదిహేను సంవత్సరాలపాటు విద్య సాంతంగా గ్రహించి యింటికి

తిరిగివచ్చినారట. ఇప్పటికికూడా మాముసలమ్మ చెప్పూ తూవుంటుంది. వచ్చేటప్పుడు రెండుగుర్రాలమీద శాలు వలూ, పట్టుబట్టలూ ధనమూ తీసుకొని వచ్చినారట. ఇప్పు డెందుకు ఆగొడవంతా! ఆరోజులు వెళ్లేయి. ఆరోజుల్లో మాకుటుంబం చాలా ఉచ్చగా వుండేదిట. అన్నట్టు అసలుసంగతి చెప్పడం మరచిపోయాను. రా యడం ఎప్పుడూ అలవాటు లేక ముందుసంగతి వెనకా వెనకసంగతి ముందూ చెప్పూతూవుంటాను, కొంచెం క్షమించండి!

ఇప్పు డున్నట్టు మాముత్తాతగారిరోజుల్లో ఈతిబా ధలు లేకుండా వున్నవని అనుకుంటున్నారేమో, అలా అనుకోవడం చాలా పొరపాటు. అవి దండులు గావు, అవి పిటూరీలు కావు, అవి గత్తరలు కావుట! మా ముసలమ్మ చెప్పూతూవుంటుంది.

కాశీనుంచి వచ్చేటప్పుడు మాముత్తాతగారు ఎంతో డబ్బు కూడా తెచ్చారట. ఎంతడబ్బు తెచ్చారు, ఏ రూపంగా తెచ్చారు అనేసంగతులు ఎవరికీ తెలియవు. ఈధనమంతా ఆయన భోషాణంలో పెట్టి ఆభోషాణం మీదనే పండుకొనేవాడట. ఇంకా ఆభోషాణం మా యింట్లో వుంది.

ఇలా వుండగా ఒకనాడు వూళ్ళో పుకారు పుట్టింది

రాఘవరాజు గత్తర వస్తోందని. రాఘవరాజు అనే క్షత్రియుడు కొంత దండు సమకూర్చి గ్రామాలలోకి రావడం ప్రతిగృహస్తు దగ్గరకూ వెళ్ళి అడిగి ధనము పుచ్చుకోవడమూ, ఇవ్వకపోతే ఇళ్ళు తగలబెట్టి గ్రామాలు దోచుకుపోవడం చేసేవాడట. ఇదే రాఘవరాజు గత్తర అంటేను. ఈవదంతి వూళ్ళో వ్యాపించడం తోనే వూరివారందరికీ పైప్రాణాలు పైకి పోయినవి. డబ్బు లేనివాళ్ళకు ఏవిచారం లేదు, డబ్బున్న వాళ్ళు తమడబ్బు దాచుకోవడమును అనేకప్రయత్నాలు చేశారు. గాదెలకింద దాచుకునేవాళ్ళు కొందరు, గాదెల్లో దాచుకునే వారు కొందురూ, తోటల్లోనూ దొడ్లల్లోనూ దాచుకునేవాళ్ళు కొందరూ, నూతుల్లో దాచుకొనేవారు కొందరూ ఇలాగ్గా అనేకవిధాలుగా ప్రజలు తమధనం ధాచుకోవడం మొదలు పెట్టినారు.

మాముత్తాతగారుకూడా తమడబ్బు ఎక్కడో దాచారుట, ఎక్కడ దాచారో ఎవరికీ తెలియదు. దాచినచోటు ఆయన ఏకారణంచేతనో ఎవరితోనూ చెప్పలేదు.

తరువాత రాఘవరాజుగత్తర ఆవూళ్ళో జరిగిందిట. కొంపలు తగలబెట్టడం, ఇళ్ళల్లో మిగిలిసొమ్ము దోచుకోవడం ఇత్యాది జరగవలసినలాంఛనాలు జరిగినవి.

అసలు చెప్పతలచుకొన్న విషయం మరిచి ఏమిటో చెప్పుతున్నాను. ఒకనాడు వేసవికాలంలో పుస్తకాల పెట్టె దగ్గిర పెట్టుకున్నాను. పుస్తకాలు తిరగవెయ్యడం మొదలుపెట్టాను. కొన్ని తాటాకుపుస్తకాలు, కొన్ని కాకితాలపుస్తకాలు, కొన్ని భూర్జపత్రాలు. ఒక కాకితాలపుస్తకం తీసి పైన చుట్టినగుడ్డ విప్పినాను. ఇటూ అటూ కర్రపలకలు పెట్టి మధ్యను కాకితాలు పెట్టి వున్నవి. ఒక కాకితం తరువాత ఒక కాకితం తిరగవేశాను. ఒక్కముక్క అర్థం కావడం లేదు. అంతా తెనుగులిపి. కాని అది చదవడం నాకు కష్ట మనిపించింది. అది యిలా తిరగవేస్తూంటే మధ్యను ఒకభూర్జపత్రం అవుపించింది. పత్రము చేతితో పట్టుకొని దానిలో ఏమి రాసివున్నదో చదువవలె ననుకొన్నాను. లిపి తెలుగే. భాష సంస్కృతం కాదు, తెనుగూ కాదు. ఇటూ అటూ తిప్పినాను.

వెనుకవేపున 'నిధికిదారి' అని వున్నది. నిధి అని చదవడంతోనే మాముత్తాతగారు దాచిన ధనం జ్ఞాపకం వచ్చింది.

ఈపత్రం నిధికి నిజంగా దారి చూపిస్తుంది కాబోలు అనుకున్నాను. అనుకోవడం కొంతసేపటికి గట్టినమ్మకములోకి దిగింది. ఆభాష ఏమిటో తెలుసుకొందా

మనీ, దానిలో కిటుకు తీద్దామనీ దృఢసంకల్పం చేసుకున్నాను.

అయితే ఇది రహస్యంగా వుంచవలసిన విషయం నలుగురికీ అడిగి ఎలాగ వెల్లడి చెయ్యగలను అనుకున్నాను. భూర్జపత్రం పైకి తీసి పుస్తకం కట్టిపెట్టి, పెట్టెలో పెట్టి అంతా సర్ది అంగవస్త్రం బుజంమీద వేసుకొని భూర్జపత్రం పట్టుకొని వూరికి కొంచెం దూరంలో వున్న దేవుడుగుళ్ళోకి వెళ్ళాను. అక్కడ ఏమి చెయ్యవలెనో ఆలోచించవలె ననివూహ.

దేవాలయానికి వెళ్ళి పత్రం కేసి చూసిచూసి ఎంతో ఆలోచించాను. ఏమీ పాలుపోయింది కాదు. దేవుడికి వెయ్యికొబ్బరికాయ కొట్టిస్తా నన్నాను. లక్షవత్తులదీపారాధన చేయిస్తా నన్నాను, దాల్లోకిటుకు దొరికి నిధి దొరికితేను. ఊహూ. ఏమీ తోచింది గాదు. ఇంక ఇంటికి లేచిపోదా మని అనుకుంటూంటే మంచివూహ స్ఫురించింది. విశాఖపట్టణంలో చాలా పేరుప్రతిష్ఠలు సంపాదించి కుశాగ్రబుద్ధి కలవాడని తెలుగుదేశంలో పేరుపొందిన "విశ్వనాథం" గారిని అడిగితే సర్వమూ విశదము కావచ్చునని తోచింది. అయితే డబ్బుతో కూడిన వ్యవహారం గదా, ఆయనతో ఎలా చెప్పడం అనుకొన్నాను.

విశ్వనాథంగారు పరధనము తృణప్రాయంగా చూసే వా రని యిదివరలో పూర్ణ చంద్రుడి విషయంలో ఆ యన పని చేసినప్పుడు లోకానికి తెలిసింది. అంతే కాకుండా ఆయన చాలా డబ్బు కలవాడు కదా అని సమాధానం చెప్పుకొని ఆరాత్రే బయలుదేరి విశాఖ పట్టణం వెళ్ళాను.

పడక కుర్చీలో పండుకొని నవల చదుకుంటున్నాడు విశ్వనాథం. నారాయణదాసు పక్క కుర్చీలో పడుకుని కునికిపాట్లు పడుతున్నాడు. నడవలో నిలబడి ‘విశ్వనాథంగారూ’ అని కేకవేశాను. దాసు ఉలికిపడి లేచినాడు. విశ్వనాథం ‘దయచెయ్యండి’ అన్నాడు. నేను గది లో ప్రవేశించి కుర్చీమీద కూర్చున్నాను.

“తమరు దయచేసిన కారణం——”

“చిత్తం! మాది పిఠాపురం కాపురమండి. మా యింటిపేరు పూలపిల్లి వారు, నాపేరు నారాయణం టారు” అన్నాను.

“ఓహో! పూలపిల్లి నారాయణగా రంటే మీారే నా! మీాపేరు ఈమధ్యను విన్నాను. జ్ఞాపకం వుంచా దాసు!” అన్నాడు విశ్వనాథం.

“జ్ఞాపకం లే కేమి! నిన్ననే కాదూ మనకు ఆసం గతి తెలుస్త!” అన్నాడు దాసు.

భూర్జపత్రంసంగతి నిన్ననే వీళ్ళకి ఎలా తెలిసింది చెప్మా, ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేవాళ్ళవలె వున్నారే వీళ్ళు అనుకున్నాను.

"తమరు గొప్పవారు, నాపేరు విన్న వినడం—

మరి ఏసందర్భాన—" అని ఏమో అనబోతూండగా విశ్వనాథం "అది వేరేసంగతి లెండి" అన్నాడు.

"అలాగ కాదండి, తమరు ఏసందర్భాన!" అనబోతూవున్నాను మళ్ళీ.

"సందర్భం మీకు కావాలా? అది ధనవిషయం" అన్నాడు విశ్వనాథం. నాగుండెల్లో రాయిపడింది. అన్నానుగదా—

"బీదవాడిని, ధనవిషయంలో నాపేరు వినడం ఎలా తటస్థించిందో తమకు?"

"అయితే పూర్తిగా చెప్పమన్నారా? మీవూళ్ళో గానుగవారున్నారు."

"చిత్తం. గానుగ రంగయ్యగారండి."

"ఆయనకు కూతురున్నదట కాదూ? స్ఫురద్రూపిట."

"చిత్తం."

"వారు చాలా బీదవారట కాదూ?"

"చిత్తం."

“పిల్లకు మంచిసంబంధం చేసి తన్మూలాన తాము కూడా లాభము పొంది వృద్ధి పొందవలెనని వూహించినారట కాదూ!”

“చిత్తం. అలాగే అనుకుంటున్నారండి.”

“చూడండి, నారాయణగారూ! నాప్రశ్నలకు మీరు యథార్థంగా వుత్తరము చెప్పితే నాకు చాలా సంతోషంగా వుంటుంది. మీకార్యంకూడా చప్పున తేలుస్తాను.”

“చిత్తం. తమయిష్టప్రకారం చెయ్యడానికి సంకల్పించుకున్నాను” అని అనక తీరిందికాదు. “మరి ఈ మధ్యను ఆ అమ్మాయికి కాకినాడనుంచి సంబంధం వచ్చింది కాదూ?”

“చిత్తం. కాకినాడలో తవ్వాల శేష శాస్త్రిగారు చాలాధనవంతులని ప్రతీతి. ఆయనకు మొదటిభార్య జారిపోయిందిట. ద్వితీయంకోసం ప్రయత్నం చెయ్యడంలో ఈసంబంధం కూడా చూచినారట.”

“సరే! ఆసంబంధం పొసగలేదట. కారణం ఏమో?”

“చిత్తం! తమతో నిజం మనవి చేస్తాను. ఆపిల్లకు కొంచెం కళ్లు జబ్బని ఎవరో వదంతి పుట్టించారు. ఆ కారణంచేత సంబంధం తిరిగిపోతుందని చెప్పుకున్నారు.”

“నిజంగా ఆ అమ్మాయికి కళ్లు జబ్బా?”

"రామరామా! లేదండి. పట్టికల్లవార్త పుట్టించారు. పిల్ల తామ్రాతీగలా వుంటుందండీ. నే నెరుగుదును."

"నారాయణగారూ, నాకేసి సరిగ్గా చూడండి. మీరే కాదూ ఆపదంతి పుట్టిస్త!"

నానోటివెంట మాట వచ్చింది కాదు. పుట్టించిన మాట నిజమే కాని పెద్దమనిషి దగ్గిర ఎలాగ వొప్పుకోవడం?

"నిజం చెప్పండి. దానివల్ల మీకు అపకారం కలగదు, నేను వాగ్దత్తము చేస్తాను. చెప్పకపోతిరా మీ కార్యం నేను చూడలేను. మీరు సెలవు పుచ్చుకోవచ్చును."

ఇంతమట్టుకు వచ్చాక యింక సెలవు పుచ్చుకోవడం ఏలాగ? ఏమైనా సరే అని చెప్పడం మొదలుపెట్టాను.

"చిత్తం, తమవద్ద తప్పు వప్పుకోక తప్పదు. నేను బీదవాణ్ణి. తప్పేల శేష శాస్త్రిగారి సంబంధం తమ కూతురికి తెచ్చిపెట్టితే రెండువందలరూపాయలు నాకు బహుమతీ యిస్తానని గొల్లప్రోలులో నూకల వెంకయ్యగారు నాకాళ్ళా వేళ్ళా బడ్డారు. అప్పుడు ఈపనికి వూనుకున్నాను నేను."

"శేషశాస్త్రిగారు వెంకయ్యగారి కూతుర్ని చేసు కున్నారా?"

"చిత్తం. పిల్ల సలక్షణంగా వుంటుందండి. వెంకయ్య గారికి భూవసతికూడా చాలా వుందండి. ఆకారణం చేత వెంకయ్యగారి కూతుర్నే ఆయన చేసుకున్నారు."

"మీరు ఇలాగ కుట్ర చెయ్యడంమూలాన గానుగ రంగయ్యగారి కూతురికి తగినసంబంధాలు రావడం లేదనీ, వచ్చినసంబంధాలు తిరిగి పోతున్నవనీ ఆబ్రాహ్మ డు ఈవూరు వచ్చి నిన్న మొరపెట్టుకున్నాడు పాపం! దానికి ఏమి శాస్తి?"

"తమరే ఏమి శాస్తి చెప్పితే దానికి వప్పుకుంటు న్నాను."

"సరే, తమకార్యాం సెలవియ్యండి." అప్పుడు నేను సందేహంతో దాసుగారికేసి చూశాను. విశ్వనాధం గ్రహించి "దాసు వున్నాడని మీరు సందేహించకం డి. ఇతను మనవాడే" అన్నాడు.

అప్పుడు నేను భూర్జపత్రం తీసి విశ్వనాధంగారి చేతులో పెట్టి దానిపూర్వోత్తరాలు చెప్పినాను. విశ్వ నాధం చాలాసేపు చేతులో వుంచుకొని నిదానించి చూచి ఆపత్రం దాసుచేతిలో పెట్టినాడు.

"దాసూ, విన్నావుటోయి, ఈభాష తెలిస్తే గొప్ప సంసారి అవుతాడు ఈబ్రాహ్మడు. ఏభాష అంటావు ఇది?" దాసు మాట్లాడలేదు.

"ఇది యేభాషా కాదు. తెనుగు" అని విశ్వనాథం అన్నాడు.

తెనుగా! అని దాసూ నేనూ ఒక్కమారన్నాము.

"ఏకే చదువు చూశాము" అన్నాడు విశ్వనాథం. దాసు దానిలో వున్నది యిలా చదివినాడు.

పాదికష్పిచి। వృషు—జా ।హుందుచుమ్మకుహంతి।పాహిం పెత్తు। శెబశె।చొందజునసో।పాపిహి జుం౦।చుదిహైంపమ।షిం౦ఘుజడాస సోపెమ।మిఢి॥

"ఇది తెను గంటావు ఏమిటి?" అన్నాడు దాసు.

"కారణం చెప్ప మన్నావా! చూశావా, నారాయణగారి మత్తాతకు ఏంభాషలు వచ్చివుంటవి' తెనుగు, సంస్కృతం, వస్తే హిందీభాషా. ఇది సంస్కృతం కాదు. మనమూ దేశాచారాన్ని అనుసరించి హిందీ చదువుతున్నాము గదా. ఇది ఆభాషలా లేదని నేను చెప్పనవసరం లేదు. ఇక మిగిలింది తెనుగు."

"అర్థం మన్నా లేని ఈవింత శబ్దాలను తెనుగంటావు, నాకు చాలా వింతగా వున్నవి."

"అయితే ఇంకో కారణం చెప్పనా: ఆయనముత్తా

తగారు ఇది రాయడం తమవారికి విని సూగపడుతుం దనేగదా, అలాంటివిషయంలో ఉపత్రంమీద తమ మాతృభాష రాసుకోక కోయభాష రాయరుగదా!"

"ఇది కోయభాషను మించినట్టు తోస్తుంది," అని దా సన్నాడు.

"అలా అనకు. ఇది తెలుగనే నమ్మకం. కొంచెం అక్షరాలు ఇటూఅటూ పడ్డాయి. అయినా చూడ్డాము కాదూ. అయితే నారాయణగారూ!"

"చిత్తం" అన్నాను.

"మీవుద్దేశం యేమిటి?"

"నావుద్దేశాని కే ముందండి! తమకు ఉపకారం చేసిపెడితే తమమేలు ఎప్పుడూ మరవను, తరతరాలా చెప్పుకుంటాము. ఎప్పుడూ తమఆజ్ఞకు బద్ధుడనై వుంటాను."

"ఉంటావా! మాట తప్పవుకదా?"

"ఎంతమాట సెలవిచ్చారు!"

"అయితే వినండి. ఈనిధి మీకు దక్కేటందుకు దీనికిటుకు మీకు దొరకాలి. అదే కదా మీరు నన్ను చూడ్డానికి వచ్చిన వుద్దేశం. ఆకిటుకు నేను మీ కిస్తాను. మీరు గానుగ రంగయ్యగారి కుమార్తెను వివాహము చేసుకోవాలి!"

"సందేహిస్తా రేమి! పిల్ల బాగుండదనా! తాం బ్రాతీకలా వుంటుందని మీరే సెలవిచ్చారు. ఆమెకు కళ్ళజబ్బు లేదని మీరే చెప్పారు. ఇంక వంశం మంచిది కాదనా? అ దేమిటో చెప్పండి మరి."

"సాంప్రదాయసిద్ధ మైనవంశమే నండీ" అన్నాను.

"అయితే సగోత్రం కాదుకద?"

"కాదండి."

"అయితే వప్పుకోండి."

"చిత్తం, తమసెలవు ప్రకారం జరిగిస్తాను. కాని కీటుకుమాట—"

"ఆవిషయములో మిమ్ములిని మోసంచేస్తానా? మీకు నిధి దొరికినతర్వాతనే తాంబూలాలు పుచ్చుకోడం. పాపం, రంగయ్యగారు సంబంధం దొరకక వూరూరూ తిరిగి యెన్నోపాట్లు పడుతున్నారు మీామూలాన."

"చిత్తం. మీాయిష్టానుసారమే—"

"ఇంకోవిషయం. రంగయ్యగారిది బీదకుటుంబం అని మీారే చెప్పినారు. ఈపెండ్లి జరిగినమీాదట వారి కుటుంబం నిలబెట్టేభారంకూడా మీామీాదే పెట్టవలెనని నాకు వుంది."

"అభ్యంతరం యేమి టండి!"

"అయితే రేపు తమరు దయచెయ్యండి. ఈకీటుకు

చెప్పుతాను. వివాహవిషయంలోకూడా తక్కినసంగ తులు మాట్లాడుదాము.”

“చిత్తం” అని నేను భూర్జపత్రపునకలు వారి కిచ్చి పత్రం పట్టుకుని బసకు వచ్చాను.

మరునాడు భోజనముచేసి విశ్వనాథంగారింటికి వెళ్ళినాను. దాసుగారూ విశ్వనాథంగారూ ఏమో మాట్లాడుకుంటున్నారు. నన్ను ఒకకుర్చీమీద కూర్చోమని వారిసంభాషణ సాగించారు.

“రాత్రి అంత టీ తాగితే మరి నిద్ర ఎలావస్తుంది?”

“టీ తాగడంవల్ల కాదోయి. దీసతస్సా గొయ్యా ఈకాగితం ప్రాణాలు తీసింది!”

“అపరాధాలు పరిశోధించడంకన్నా కష్టం అనిపించిందా?”

“సరీ, దానంతకష్టం ఇదీ పెట్టింది.”

“కిటుకు దొరికిందా?”

“మనచేతులో బడ్డాక దొరక్క పోతుందా?”

అప్పుడు నాకు అపరిమితానందం కలిగింది. లక్షాధికారిని అయ్యాననుకున్నాను. వస్త్రాలు కట్టించాలనుకున్నాను. విశ్వనాథంగారికి ఏవేవో చెయ్యాలనుకున్నాను, జ్ఞాపకం లేదు.

“ఏమి టాకిటుకు!”

“వ్రాశికే చెప్పేస్తే ఏముంది! దానిపస పోతుంది. ఇలా దగ్గరగా రా. దాని వ్యవహారం చెపుతాను.”

దాసు కుర్చీ దగ్గరకు లాగుకున్నాడు. ఇద్దరూ కాగితం చూస్తున్నారు. ఉండబట్టలేక నేను భూర్జపత్రం తీసి చూడడం మొదలుపెట్టినాను.

“మొదటినుంచీ చెప్పలేదూ, ఇది తెలుగని.”

“తెలుగేనా చివరికి? ఏలా తీశావు కటుకు మరి చెప్పు. నారాయణగారు ఆదుర్దా పడుతున్నారు పాపం!”

“అయితే విను మరి. ఈ కాగితం ‘నిధికిదారి’ చూపుతుందని భూర్జపత్రం వెనక రాసినమాటలనుబట్టి తెలుస్తూవున్నదికదా. అది జ్ఞాపకం వుంచుకో. ఈ వ్రాత పరిశీలించి చూస్తే ఎక్కడ కక్కడకు పదాలు విభజించి వున్నాయి. మొత్తంమీద పదకొండు పదాలున్నట్టు తేలుతుంది. అందులో సిధి అనేపదం వుంటుందని నీకు తోస్తుందా?”

“వుండవచ్చును.”

“వుండవచ్చును కాదు, వుంది చూడు. ఇందులో రెండక్షరాలపదము చివర వుంది. ‘మిభి.’ ఇది సిధి కావచ్చును. మొదట అనునాసికము ఇత్వముతో కూడి ఉండమువల్ల, రెండవది ఇత్వముతోకూడి నవత్తు అక్షరము అవుటవల్లాను. ఈపదాన్నిబట్టి మన

ము ఇంకొకటి గ్రహించవచ్చు. ఈచీటిలో హల్లులే మార్చినారు కాని అచ్చు లేమీ మార్చలేదని."

"కావచ్చును."

"మిభి ఇంతమట్టుకు 'నిధి' గా గ్రహించాము. రెండక్షరములు మనకు తెలిసినవి. కాబట్టి మనము 'మ' వున్నచోట 'న' పెట్టి 'భ' వున్నచోట 'ధ' పెట్టి చీటి మళ్ళీ రాయవచ్చును."

"రాస్తే లాభం ఏమిటి?"

"చెబుతా విను. కొంతమట్టుకు మనకు తెలిసింది. కాబట్టి మూడక్షరాల పదం తీసుకుందాము. అది 'సోఫుమ.' 'మ' అనగా 'న' అని మనకు తెలుసును. అప్పుడు 'సోఫుమ' అనేది 'సోఫున' అవుతుంది. 'సోఫు' ఏఅక్షరాలయి వుంటాయి అని ఆలోచించాలి. 'సోఫున నిధి' అంటే అర్థం లేదు. చాలాసేపు ఆలోచించిన మీదట 'సోఫున' అనేది 'లోతున' అని నాకు తట్టింది. ఎందుచేత నంటే, డబ్బు పాతినవాళ్లు ఇంతలోతులో పాతినామని చెబితేకాని లాభంలేదు చూడూ."

"లోతున ఎందుకు కావాలి? పైపున కాకూడదూ!"

"అచ్చులు మారలేదన్నసంగతి నీవు మరిచినావు."

"సరే."

"ఇంతమట్టుకు కొంత కీటుకు దొరికింది.

స=ల; వ=త; మ=న; భ=ధ అనీ మనకు తెలిసింది. తరవాత ఇంకో సంగతి. తెలుగులో చాలామార్లు రాతలో వచ్చే అక్షరాలు ఏమై ఉంటాయి అని ప్రశ్న వేసుకున్నాను. న, వ, ర, త, గ, అని తోచింది. చీటీలో చాలామార్లు వచ్చిన అక్షరాలు ఏమిటి? ఇది గో, ష, ఆరుసార్లు; ప, హ, మ, ఐదుసార్లూ, డ, జ, త నాలుగుమార్లూ వచ్చినవి. చాలామార్లు వచ్చిన ఈ అక్షరాల బదులు పైన చెప్పిన అక్షరాలు ఇది కాదని అదీ, అది కాదని ఇదీ, పెట్టి తంటాలుపడి మొత్తంమీద 'ష' అంటే 'ర' అనీ, ప హ మ లు త వ న లనీ గ్రహించాను. మొత్తంమీద మనకు ఈ అక్షరాలు తెలిసేయి. స=ల; వ=త; మ=న; భ=ధ; ష=ర; హ=వ. ఈ తెలిసిన అక్షరాలు పెట్టి మళ్ళీ రాసి చూద్దాం ఎలా వుంటుందో.

తాదికరి—చి। తూర్కు—జా। వుందుచున్నరు వంతి। రావిపెత్తు। తె బత। చొందజావలో రాతివి జ్రవం।ముదిపై కునరెందుజడాల।లో తున।నిధి

"ఇప్పుడు కొంచెం దీనికి తెలుగువాలకం వస్తోంది. కొన్నిముక్కలు నేనుకూడా వూహించి చెప్పగలనుసుమా."

"ఆ, అదీ. దారిలో పడుతున్నావు. ఏదీ, నీకు స్ఫురించింది చెప్పు."

"'తూర్పుగా వుందుచున్నదువంతి' అనేది 'తూర్పుగా వున్నదుకున్నటు పంటి' కాకూడదా!"

"అదే, సందేహం లేదు, కాని ఆఖరు అక్షరం 'త'='ట' అయింది. కాబట్టి ర, టా కాదు. అది వుండుకున్న పుపంటి కావాలి. తరవాత."

"రెండుజడాల-రెండుగజాలకావచ్చునను కుంటూ."

"సరి, మరి ఇప్పుడు తెలిసిన అక్షరాలన్నీ పట్టీ వేసి యిది యెలా రాశారో ఈకీటుకు కనిపెట్టు." దాను పట్టీ వేసినాడు. కాని తనకు స్ఫురించలే దన్నాడు.

"చూశావూ. కవర్గఅక్షరా లుండవలసినచోట ఏ అక్షరాలు వచ్చేయి!—"

"చవర్గ అక్షరాలు వచ్చినట్లుతోస్తుంది."

"చవర్గ వుండవలసిన చోటో?"

"టవర్గ. సారి, తెలిసింది! కవర్గబదులు చవర్గ; చవర్గబదులు టవర్గ; టవర్గబదులు తవర్గ; తవర్గబదులు పవర్గ; పవర్గబదులు కవర్గ, ఇది తెలుస్తూనేవుంది."

"మిగిలిన అక్షరాలమాట?"

"యరలవలబదులు శషసహాలు; శషసహాలబదులు యరలవలూను."

"సరే, నీకు అంతా తెలిసింది."

"ఈకీటుకు నీవు ఎలా పట్టినావోయి!"

"నారాయణగారిమీత్తాశ వ్యాకరణశాస్త్రవేత్త అనేసంగతి మరచిపోయావు నువ్వు. అంచేతనే మనను ఇలా బాధపెట్టారు! కానీగాని అదంతా తెలుగులో రాసి శాస్త్రుల్లుగారికి చెప్పు."

"చెప్పడానికేముంది. ఇదిగో."

"తాడిపత్రికి తూర్పుగా వుండుకున్న షుమంటి రావిచెట్టుయెదుట కొండగుహలో రాతివిగ్రహం కుడివైపున రెండుగజాలలోతున నిధి."

నేను కాకితంమీద అంతా రాసుకున్నాను.

"ఏమండీ, నారాయణగారూ! మీకు సంతృప్తిగా వుందా?"

"సరిసరి! ఎంతమాట సెలవిచ్చినారు! ఎప్పటికైనా మీఋణం తీర్చుకోగలనా అని ఆలోచిస్తున్నాను."

## 3

దాసుగారూ నేనూ కలిసి తిరుగుబండిలో పిఠాపురం వచ్చి ఆరాత్రే బయలుదేరి తాడిపత్రికేసి వెళ్ళినాము. కొంచెం కొంచెం గుడ్డివెన్నెలగా వుంది. రావిచెట్టు కనుక్కున్నాము. దానికి ఎదురుగా కొండ మైలుదూరం

లో వున్నది. అక్కడకు వెళ్ళినాము. గుహ కనుక్కోవడంమాత్రం చాలా కష్టమయింది.

దాసుగారు కుడివైపున వున్నకొండ గుహ బాగా పరీక్షించినారు. అక్కడ గోడకు దాసిపెట్టుకొని చాపరాయి వున్నది. అది యువతలకు లాగి నన్ను అక్కడ తవ్వమన్నారు. తవ్వినాను. తవ్వగా తవ్వగా రాగి చెంబు కనిపించింది. ఇంకా గజంలోతు తవ్వి చెయ్యి పెట్టి చూశాను. ఇంకేమీ అవుపించ లేదు. రాగి చెంబుమీద మూత తాపడం చేసివున్నది. విశాఖపట్టణం వెళ్ళి విశ్వనాధంగారియెదట మూత తీయించవచ్చునని దాసు చెప్పితే మాభాగన్నాను.

మూత తీయించి చూస్తే దానిలో బంగారు కణికలు, ముత్యాల హారాలూ, వజ్రాలపతకాలు, కెంపుల పతకాలూ, కానవచ్చినవి. మొత్తంమీద రెండులక్షలఖరీదు వుంటుందని మదింపు వేశారు.

మొదట నా కిష్టం లేక పోయినా రంగయ్యా మామగారి కుమార్తె మంచి పనిమంతురాలు కావడంవల్లా, సలక్షణమైన పిల్ల కావడంవల్లా, మంచిగుణాలు కలది —నే చెప్పకో కూడదు— కావడంవల్లా నాకు అదృష్టంవల్ల సమకూడిందని తరవాత అనుకోక తప్పింది కాదు. నాభార్యా నేనూ సిరిసంపదలతో తులతూగుతూ

వున్నాము. అన్నట్టు చెప్పడంమరచిపోయినాను. విశ్వ
నాథంగారికి ఒకతృణం ఇద్దామనిసంకల్పం చేసుకొని ఆ
సంగతి వారితో చెప్పినాను. సుతరాం ఆమాట వారు
విన్నారు కారు. దాసు నాప్రాణస్నేహితుడై నాడు.

మావూళ్ళో దేవుడికి వెయ్యి కొబ్బరికాయలు కొట్టిం
చాను. సుమండీ! లక్షవత్తుల దీపారాధానకూడా చేయిం
చాను. సత్రంమాట ఆలోచిస్తున్నాను.

వూలపిల్లి నారాయణ

సరపు నారాయణశాస్త్రి

౧౯-౨౦

# చెంచుదంపతులు

## ౧

నల్లమల కొండలలో నంతతము ప్రవహించే సెలయే టికి సమీపంలో వున్న చెంచుగూడెములో లింగడు కాపురము చేస్తున్నాడు.

లింగడు ఇంతవరకూ తల్లిదండ్రులవద్దనే నివసించే వాడు. పెండ్లి చేసుకొని కొన్ని నెలలే అయింది. తాను భార్యా వేరుగా ఇల్లొకటి యేర్పాటుచేసుకొని కాపు రము చేస్తున్నారు.

భగవంతుడు పెంచిన దట్టమయిన చెట్లక్రింద నిర్మిం పబడ్డది వీరిగూడెము. ఒకచెట్టుకింద వలయాకారముగా వెదురుబద్దలతో చిన్నగుడిసెలు సొంతముగా కట్టుకొని అందులో ఈదంపతులు కాలక్షేపము చేస్తున్నారు. వర్షాకాలమందే ఆయింట్లో పండుకోడం. తమవస్తువులు ఉంచుకోడానికీ వంటచేసుకోడానికీ ఆయిల్లు సాధారణ ముగా పనికివస్తున్నది.

లింగడిభార్యపేరు ఈరమ్మ. వీరిప్రేమగాథ నాగర కుల ప్రేమగాథలవంటిదే. వారిహృదయానుభవాలే వీ రివిని. చిన్నతనమున చెట్ల నల్లుకొన్నతీగలను ఉయ్యా

లలుగా చేసుకొని వారు ఊగులాడేవారు. ప్రాతఃకాలములందు ఇరువురూ కలిసి కొండల్లో తిరుగాడుతూ, పక్షుల వేటాడుతూ వేటాడినజంతువులను ఆరగిస్తూ సాయంకాలానికి ఇంటికి తిరిగివచ్చేవారు. ఇరువురూ ఒక్కబడిలోనే చదువుకున్నారు కూడా. చదువులయ్యా బడికి పోయినప్పుడల్లా యిచ్చేపప్పులను వాళ్ళిద్దరూ చెట్టుకింద కూచుని తినేవారు. బడికి పోయేవారికి దొరతనమువారు ఇచ్చేబట్టలను వారు కట్టుకొని బడికి పోవుట మాని తిండికై వేటాడబోయేవారు. బడి విడిచేటప్పటికి వారి కలవడినవిద్య అక్షరములు గుర్తించడమే. ఈ అక్షరము లనేగీతలను అయ్యావారు ఏల నేర్పుతున్నాడో వారికి బోధపడలేదు. హిందూదేశములో పలుజాతులకువలెనే వీరికి ప్రకృతము కావలసింది విద్య కాదు, తిండి! విజ్ఞానము కాదు, కట్టుబట్ట.

ఈరమ్మకు యౌవనము పొడచూపింది. లింగడుకి హృదయము పరిభ్రమించింది.

ఒకనాడిరువురూ కలిసి తేనెపెరలు తాగడానికి కొండఅంచులకు పోయినారు. లింగడు కొండ యెక్కినాడు. ఏటవాలుగావున్నకొండకింద ఈరమ్మ నిలబడి చూస్తున్నది. లింగడు ఒకబండచివరకు వచ్చి బండకిందితట్టు లోభాగమున వున్న తెట్టెను వెదుకుతో

పొడిచినాడు. ఈగలు జుమ్మని ఒక్కమారు లేచినవి. తెట్టె కింద పడలేదు. లింగడు ఈగలబాధకు తాళలేక కిందకు వచ్చినాడు. ఈరమ్మ మొగము చిట్లించుకున్నది.

కడచినదినము తిన్న ఆహారమే గాని వారి కాపొద్దు తిండి లేదు. ఉభయులకూ బాగా ఆకలివేస్తున్నది. తేనె తాగి మైనము తినవచ్చు ననుకున్నారు గాని సాధ్యపడలేదు. లింగడిమనస్సు చివుక్కు మన్నది. ఈరమ్మ కొండకింద పొగబెట్టడానికి ప్రయత్నముచేస్తున్నది, అట్టిపని అడవికి ప్రమాదమని ఆమెకు తెలియదు. లింగడికి తెలుసును. ఒకమారు "కరిగాడు" అలుగు విడిచినాడు. అది అడవిలో ఎక్కడనో పడిపోయి కానవచ్చింది కాదు. నాగా అడవిని కాల్చివేసి అలుగును సంపాదించినాడు. దొరతనమువారందుకు వాణ్ణి శిక్షించినారు.

పొగ పెట్టవద్దని ఈరమ్మతో లింగడు చెప్పి మళ్ళీ కొండ ఎక్కినాడు. ఈరమ్మకూడా వానివెంట వెళ్ళింది. ఇద్దరూ బండచివరకు వెళ్ళినారు. లింగడు బండమీద సాగిలబడి ముందుకు జరుగుతూ పోయినాడు. ఈరమ్మ అతనిచేతి నొకదానిని గట్టిగా పట్టుకున్నది. లింగడు బండచివరకు పోయి దేహమును వంచి రెండవచేతితో తేనెతెట్టును బట్టి ఊడబెరికినాడు. ఈరమ్మ లింగడిని

వెనుకకు లాగినది. ఇద్దరును ఒకరి నొకరు చూచుకొని నవ్వుకొన్నారు. తేనెతట్టు దొరకినది. కాని ఇద్దరి దేహములూ ఈగకాటులవల్ల గాయము లైనవి. ఆకుపసరు ఒంటికి పూసుకొని తేనె తట్టు పట్టుకొని వారొక మడుగు దగ్గరకు పోయినారు. ఒక చెట్టుకింద కూర్చున్నారు. చీకటి పడినది. చంద్రుడుదయించినాడు. పొడలు పొడలుగా వెన్నెల అడవి అంతటా పడినది. తాండ్రపువ్వులు అడవిని సువాసనలతో నింపుతున్నవి. పక్షులు చెట్లమీద కిల కిల లాడుతూ గోల చేస్తూవున్నవి. ఇద్దరూ ఆచెట్టుకింద ఆ తేనెపెరను తింటూన్నారు. ఈరమ్మ ముక్కలు చేస్తూ ఒక్కొక్క ముక్కను లింగనినోటికందించుచున్నది. లింగడు ఈరమ్మ దేహమును నొప్పి పోవుటకై నిమురుతున్నాడు. తిని కడుపు నిండా నీరు తాగినారు. ప్రపంచ మిప్పుడు వారికి సుఖమయమయి తోచింది. లింగడు ఈరమ్మ గాయములకు చల్లనినీరు రాస్తున్నాడు. ఈరమ్మ లింగని దేహమును చల్లటి నీళ్లతో కడిగింది.

ఆ చెట్టుకింద ఆమసుగు గట్టున ఆవెన్నెల వీలికల మధ్య ఆయిరువురూ ఒండొరుల కౌగిట జిక్కి ఒక్క ముద్దు పెట్టుకున్నారు. అడవిలో సువాసన అధిక మయింది.

విహంగగుతముల మనోహరత్వ మతిశయించింది. చం
ద్రిక మిక్కిలి ప్రకాశవంతమయింది.

౨

వాళ్ళు ప్రతిదినమూ అడవులలో తిరిగి దొరికిన
చిన్న జంతువులను తేనె తట్టులను, చెంచుగడ్డలను తినే
వారు. కొత్త దినాలలో ముచ్చట యిది. ఆరోజుల్లో
ఒక్కొక్కప్పుడు తిండి దొరకక పోయినప్పటికీ వారు
లెక్క చేసేవారు కారు. క్రమ క్రమంగా తక్కిన చెం
చులువలెనే వారూ కష్టపడి కూలి సంపాదంచుకొన
వలసి వచ్చింది. లింగడు వెదురు కొట్టుతూ బద్దలకింద
వాటిని చీల్చుతూ యిట్టిపనులను చేస్తూ రోజు కార
ణాలవంతున సంపాదిస్తూవున్నాడు. ఈపని వీరికి దొర
తనము వా రేర్పాటుచేసి తమ వుద్యోగస్థులచేత
రోజుకూలి యిప్పిస్తారు.

ఈరమ్మ అడవులలో తిరిగి తిరిగి దొరికినంత తేగలిగి
నంత చింతపండు, కుంకుడుకాయలు, షీకాయ, చార
పప్పు మున్నగు వస్తువులు తెచ్చి దొరతనము వారు
వేర్పాటు చేసిన వుద్యోగస్థులకు తూనిక ప్రకారం
అమ్మి కొన్ని అణాలు సంపాదించుకొంటున్నది.

గడించిన ఈధనమును వారు పట్టణాలకు తీసుకు పోయి బియ్యము ఉప్పు మున్నగు వంటవస్తువులు బట్టలు, పిల్లల కిమ్మలూ, కొనేవాళ్ళు.

గానరు మొంటువారు ఈయేర్పాటు చెయ్యకముందు చెంచులు ఈవస్తువులను పట్టణాలలో కోమట్లకు అమ్ము తూ వుండేవారు. కోమట్లు మిక్కిలి చౌకగా కొని ధన వంతులు అయ్యేవారు. ఇప్పుడు దొరతనమువారు చెంచులను బాగుపరిచే ఉద్దేశ్యముతో ఆవ్యాపారం తామే జరిగిస్తున్నారు. ఆనాటి చెంచులస్థితికీ ఈనాటి స్థితికీ భేదం లేదు. ఎప్పుడూ వారు తిండికి బట్టకూ లేక కష్టపడుతూ వుండవలసిందే.

పుష్కలంగా తిండి పెట్టుగలఅడవులకు పిల్లలై జం తువులు, చెంచువాళ్ళు, ఇతరఅడవిమనుష్యులు జనించా రు. జంతువులకు కడుపునిండా తిండి కద్దు. ఆఅడవికడు పున బుట్టినమానవులకు తిండిలేదు. వారితల్లి కా యీ పక్షపాతము? తోడిమానవుల దౌర్జన్యమా యిది?

దంపతులిద్దరూ వసంతకాలాన మామిడిచెట్లను ఆశ్ర యించి అవి ఇచ్చే కాయలతోనూ పండ్లతోనూ పొట్ట నింపుకొనేవారు.

చెంచువాండ్లకు ఆవులు బర్రెగొడ్లూ విశేషంగా వుంటవి. అవేవారిఆస్తి. లింగడికీ భార్యకూ మొత్తే పదిఆవు లున్నవి.